

# *Face to Face with Nature*



చిలికా – ఆడే, పాడే, ఎగిరే పిల్లల బడి! ప్రశాంత సుందర స్వప్నం లాంటి ఈ చిలికా సరస్సు ఒరిస్సా తూర్పుతీరంలో ఉన్నది. చిలికాలో ఉన్నట్టయితే మీరు ప్రకృతి పాఠశాల తరగతి గదిలో ఉన్నట్టే ! ప్రకృతి రహస్యాలను గురించిన అద్భుతాలను అఆల నుంచి ప్రత్యక్షంగా చూసి నేర్చుకోవచ్చు. 'ఇదిగో డాల్ఫిన్!' 'అదిగో హెరాన్' – అని చూపడానికి వీలుగా పిల్లల కోసమే వెలసిన సజీవ బొమ్మల పుస్తకం! తల్లితండ్రులకో గమనిక : క్షణం క్షణం కొత్త కొత్త సొబగులను సంతరించుకుంటూన్న ఈ ప్రత్యేక పుటకేసి మీ పిల్లల నేత్రాలను తెరిపించండి. చిలికా సరస్సు వలస పక్షులకు శీతాకాల నివాసం. వివిధ పక్షుల విభిన్న వర్ణాలూ, వింత వింత స్వరూపాలూ యువమనసుల ఊహలకు గిలిగింతలు పెడతాయి. పడవలలో అద్భుతమైన చిన్న చిన్న దీవులను కనిపెట్టి కొత్తకొత్త అనుభవాలను సొంతం చేసుకోవచ్చు. పిల్లలకూ, పసిహృదయాలకూ మరింత ఉత్సాహాన్ని కలిగిస్తాయి ఇక్కడి జలక్రీడలు! నిర్మలమైన వినీలజలాశయం మధ్యలోనే సుప్రసిద్ధ 'కాళీజయ్' ఆలయం ఉన్నది. కాళీజయ్ మాత చరిత్ర పసిహృదయాలను పసిడికలలా వెన్నాడుతుంది. చిలికా సరస్సు ఉజ్వల దివ్యాద్భుత సౌందర్యాన్ని మీ కెమెరా ఫిల్ములో బంధించి అందమైన సుమధుర క్షణాలను మీ పిల్లల హృదయాలలో శాశ్వతంగా నిలిచిపోయేలా చేయండి!




For more information contact : Director, Tourism, Paryatan Bhavan Bhubaneswar-751014 , Tel : (0674) 432177, Fax: (0674) 430887 e.mail: ortour@dte.vsnl.net.in, website: orissa-tourism.com Tourist Offices at: **Chennai** : 42/18, Mount Road, (2nd Floor) Gee Gee Complex, Pin - 600002, Telefax : (044)8534090 **Calcutta:** Utkal Bhawan 55, Lenin Sarani, Pin : 700013, Tel : (033) 2443653, **New Delhi :** Utkalika, B/4, Baba Kharak Singh Marg Pin - 110001, Telefax (011) 3364580






NATURATA

# చందమామ



సంపుటి 103 అక్టోబర్ 2000 సంచిక 4

## ఈ సంచికలో...

కథలు



### ఈ నెల విశేషాలు



పుణ్యదానం
(బేతాళ కథలు)

చావురానివాడు





కపట
వైద్యుడు



భారత సంస్కృతి
చరిత్ర

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, Chandamama Buildings, Vadapalani, Chennai–600 026. Editor: Viswam

దూర తీరాల్లో వున్న

మీ వాళ్ళ కోసం

ముచ్చటగా ఇవ్వతగ్గ

ఏకైక బహుమతి



# చందమామ

వారి భాషల్లో
వారితో మాట్లాడే
చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ, కన్నడ
మలయాళం,మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు
పన్నెండు సంచికలు రూ. 900

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా
పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారా గానీ
చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది
చిరునామాకు పంపండి:

PUBLICATION DIVISION
CHANDAMAMA INDIA LIMITED
CHANDAMAMA BUILDINGS, VADAPALANI, CHENNAI-600 026


సంపాదకుడు
విశ్వం



ఉత్తర ప్రత్యుత్తరాలకు:
చందమామ మేగజైన్ డివిజన్
చందమామ బిల్డింగ్స్
వడపళని, చెన్నయ్- 600 026
ఫోన్/ఫ్యాక్స్: 4841778
4842087
ఇ. మెయిల్: Chandamama@ vsn lcom

ముంబాయి కార్యాలయం
2/B, నాజ్ బిల్డింగ్స్
లామింగ్‌టన్ రోడ్,
ముంబాయి-400 004
ఫోన్ : 022-388 7480
ఫ్యాక్స్: 022-388 9670

అమెరికాలో
విడికాపీ $2
సంవత్సర చందా $20
సొమ్ము పంపవలసిన చిరునామా:
ఇండియా అబ్రాడ్
43 వెస్ట్ 24 స్ట్రీట్
న్యూయార్క్, ఎన్.వై 10010
ఫోన్: (212) 929-1727
ఫ్యాక్స్: 212-627-9503




## సవరణ

లాంగ్‌జంప్‌లో 28 అడుగుల బేరియర్‌ను అధిగమించిన తొలివీరుడు బాబ్ బీమోన్. సెప్టెంబర్ 2000 సంచికలో ఒలింపిక్ క్విజ్‌లో తెలిపినట్టు హైజంప్‌లో కాదు. 38వ పేజీలో జాన్ అకీబువా 100 మీటర్ల హర్డిల్స్‌లో బంగారు పతకం సాధించినట్టు అచ్చయింది. అది అచ్చు తప్పు. 400 మీటర్ల హర్డిల్స్ అని ఉండాలి. దయచేసి గమనించగలరు.




సంచాలకులు

చక్రపాణి. బి.నాగిరెడ్డి


# భవిష్యత్తుపట్ల విశ్వాసం!

కోయంబత్తూరు నుంచి కాశ్మీరు వరకు చెలరేగిన తీవ్రవాదం అసంఖ్యాకమైన అమాయక ప్రాణులను బలితీసుకున్నది. ఇంకా ఈ మారణకాండ ఆగలేదు. ఈ తీవ్రవాదాన్ని ఎదుర్కొని, అరికట్టడానికి విపరీతమైన ధనవ్యయం జరుగుతున్నది. ప్రభుత్వయంత్రాంగం దృష్టి దీనిమీదే కేంద్రీకృతమైపోవడంతో జరగవలసిన అభివృద్ధి కార్యక్రమాలు సవ్యంగా సాగడం లేదు. అయినా ఈ తీవ్రవాదాన్ని సమూలంగా అణచలేకపోతున్నాం. ఎందుకంటే - దొంగచాటుగా దెబ్బ తీయడమే దీని మార్గం. ప్రత్యక్షంగా ఎదుర్కోవడానికి ధైర్యం కావాలి. సంప్రదింపులతో, చర్చలతో మెప్పించి ఒప్పించడానికి తెలివితేటలు కావాలి. అయితే, సభలలో, వాహనాలలో, జనం రద్దీగా వున్న ఇతర ప్రదేశాలలో బాంబులు పెట్టడానికీ, విసరడానికీ పిరికిపందలు చాలు!

మనదేశంలో బీభత్సం సృష్టిస్తున్న ఈ తీవ్రవాద కార్యకలాపాలకు విదేశీసంస్థల నుంచి ఆర్థికంగానూ, ఇతరత్రానూ సహాయం అందుతున్నదన్న విషయం తేటతెల్లం. భారతదేశం శాంతియుతంగా అభివృద్ధి సాధించడం వాటికి గిట్టడం లేదు. అయితే మనదేశం ఎన్నో అవరోధాలను అధిగమించినట్టే, ఈ విషమదశను కూడా విజయవంతంగా అధిగమించి ముందుకు సాగుతుంది. అందులో సందేహం లేదు. మనకు కావలసిందల్లా దేశభవిష్యత్తు పట్ల దృఢమైన విశ్వాసం. మానవజాతి నాగరికత పల్లవిస్తూన్న తొలిదశలోనే ''జీవితం అంటే ఏమిటి?'' అనే అన్వేషణ ఆరంభమయిన జ్ఞానభూమి భారతదేశం. ఇక్కడినుంచి వెలువడిన ప్రగాఢ సత్యాలతో ప్రపంచం పరిపుష్టమయింది. ప్రశాంతవాతావరణంలో ఇక్కడున్న ఉదాత్త విషయాలను గ్రహిస్తే ప్రపంచం మరింత సుసంపన్నం అవుతుంది!

భారతదేశం తీవ్రవాద దౌష్ట్యాలకు తలవొగ్గదన్న సత్యాన్ని మన పరిపూర్ణ విశ్వాసం ద్వారా మిత్రులకు తెలియజేయాలి. మనం కనబరచే ధైర్యం - విశ్వాసమే సంఘవ్యతిరేక శక్తులకు దీటైన సమాధానం అవుతుంది!



# చందమామ కబుర్లు

## యుద్ధం ముగిసిన జ్ఞాపకార్థం!




1939వ సం॥ లో రెండవ ప్రపంచయుద్ధం ఆరంభమైనప్పుడు సోవియట్ యూనియన్ తటస్థంగా ఉన్నది. జర్మనీ, ఇటలీ, జపాను దేశాల కూటమి యుద్ధం ప్రారంభించింది. బ్రిటన్ నాయకత్వం వహించిన ఫ్రాన్స్, అమెరికా దేశాల మిత్ర పక్షం వివిధ ప్రాంతాలలో మొదట దెబ్బతిన్నది. నాజీ నాయకుడు హిట్లర్ నాయకత్వంలో జర్మనీ - పోలండు, జెకోస్లొవేకియా మొదలైన దేశాలను వశపరచుకుని, సోవియట్ రష్యాను ఆక్రమించడానికి విఫలయత్నం చేసింది. సోవియట్ రష్యా మిత్రపక్షంతో చేతులు కలిపింది. ఆ తరవాత యుద్ధవిరమణను గురించి చర్చించడానికి విన్స్టన్ చర్చిల్ (బ్రిటన్) హ్యారీ ఎస్. ట్రూమన్ (అమెరికా) జోసెఫ్ స్టాలిన్ (సోవియట్ యూనియన్) ఒకచోట సమావేశమయ్యారు. ఈ ముగ్గురి నాయకుల సమావేశానికి జ్ఞాపకార్థంగా రష్యన్ సెంట్రల్ బ్యాంక్ ఆ ముగ్గురి నాయకుల బొమ్మలతో ఇటీవల 100 రూబుల్ ప్రత్యేక నాణాలను విడుదల చేసింది. సరిగ్గా 500 నాణాలే విడుదల చేశారు. అవి నిజంగానే ప్రత్యేకమైనవి; అమూల్యమైనవి!

## కార్యం మొదట కారణం తరవాత?!



వెలుగు అంటే కాంతి కిరణాలు మిగతావాటి కన్నా అత్యంత వేగంగా పయనిస్తుందని ఇంతవరకు అనుకునేవాళ్ళం. సెకనుకు 186,000 మైళ్ళ వేగంతో పయనిస్తుందని లెక్కలు గణించారు. ఇప్పుడు ఈ భావాన్ని మార్చుకో వలసివస్తున్నది. అమెరికాలోని ఎన్.ఇ.సి. పరిశోధనాసంస్థకు చెందిన ప్రముఖ శాస్త్రజ్ఞుడు డా.వ్యాంగ్ - వెలుగు స్పందనల (లైట్ పల్సస్) ను 300 రెట్లు పెంచవచ్చని నిరూపించాడు. అంటే - కాంతి జన్మస్థానం వదలక ముందే భూమిని చేరుతుందన్నమాట! ఇదే నిజమైతే కార్యానికి ముందు కారణం కాదు - అని భౌతికశాస్త్రంలోని మూలసూత్రాన్నే తిరగరాయవలసి వుంటుంది. ఐన్స్టీన్ సాపేక్షసిద్ధాంతానికి కూడా గండి పడుతుంది!

## కనిపించని ఆశ్చర్యార్థకం!

ఇటీవల రష్యా ప్రెసిడెంట్ కార్యాలయానికి ఒక ఆహ్వాన పత్రం అందింది. పాఠశాల విద్య పూర్తిచేసుకుని వెళుతూన్న విద్యార్థులు జరిపే నాట్యప్రదర్శనను తిలకించడానికి రమ్మని పిలిచారు. ఆ ఉత్తరంలో రెండు అక్షరాల తప్పులు దొర్లాయి. 'గౌరవనీయులైన వ్లాడిమీర్ పుటిన్' అన్న తరవాత ఆశ్చర్యార్థకం లేదు. తరవాత ఇంకొక చోట పెద్ద అక్షరానికి బదులు చిన్న అక్షరం పడింది. ప్రెసిడెంట్ కార్యాలయాధికారులు ఈ తప్పులను తీవ్రంగా భావించారు. ప్రెసిడెంటును ఆ కార్యక్రమానికి వెళ్ళ వద్దన్నారు. ఆ లేఖను రాసిన అన్నాప్రవోరోవాకు ఇవ్వ వలసిన వెండి పతకాన్ని ఆపి, మార్కులు తగ్గించారు. ఇప్పుడు ఆ పాఠశాల యాజమాన్యం, ప్రెసిడెంటు జోక్యం చేసుకుని ఆమె మార్కులూ, వెండి పతకం తిరిగివచ్చేలా చేయాలని ప్రెసిడెంటుకు విన్నవించుకున్నది!






## అచ్చు తప్పుకాదు

బ్రాడ్మెన్ అంటే నిజానికి బ్రాడ్మన్ మాత్రమే . అంటే సుప్రసిద్ధ క్రికెట్ క్రీడాకారుడు సర్ డొనాల్డ్ బ్రాడ్మన్ కాదు; ఆయన కొడుకు! అభిమానుల మధ్య, సాధారణ ప్రజల మధ్య తన తండ్రికి వున్న పేరు ప్రఖ్యాతులు, వాటివల్ల ఆయన ఎదుర్కొంటున్న ఇబ్బందులు చూసి తనకాగతి పట్టకూడదని గత ముప్పై సంవత్సరాలుగా తనపేరుకు ముందు 'జాన్' అని తగిలించుకుని గోప్యంగా ఉన్నట్టు ఆయనచెప్పాడు. ఆస్ట్రేలియాకు చెందినసుప్రసిద్ధ క్రీడాకారుడు సర్ డొనాల్డ్ బ్రాడ్మన్‌కు ఇటీవల గొప్ప సత్కారం జరిగింది. ఆస్ట్రేలియా సుప్రసిద్ధుల్లో 'ఈ శతాబ్దపు క్రీడాకారుడు' అనే బిరుదు ప్రదానం జరిగింది. ఆ సత్కారసమావేశానికి తండ్రి తరఫున కొడుకు హాజరయ్యాడు. ఆయన పేరు పిలవగానే ఆయన లేచి నిలబడి తన పేరును జాన్ బ్రాడ్మన్‌గా ప్రకటించాడు. 1972 తరవాత మొట్టమొదటిసారిగా దానిని బయటపెట్టాడు. పదిమంది దృష్టి నుంచి ఇంతకాలం తప్పించుకున్నాడు!

కథకు సరైన ముగింపు రాయండి! చక్కని బహుమతి గెలుచుకోండి!

# సృజనాత్మక పోటీ!

*ఒక చిన్నకథ తొలిభాగం దిగువ ఇవ్వబడింది. ఆసక్తికరమైన కథగా రూపొందే అంశాలన్నీ అందులో ఉన్నాయి. అయితే, దాన్ని రసవత్తరంగా మలిచే శక్తి మీ చేతుల్లోనే ఉంది. సరైన ముగింపుతో, మిగిలిన కథను రాయండి. కథకు తగిన పేరు పెట్టండి. మీ రచన 200 పదాలకు మించకుండా ఉండాలి. ఉత్తమమైన ముగింపుకు ఆకర్షణీయమైన బహుమతి ఇవ్వబడుతుంది. ఈ పోటీ మన యువపాఠకుల కోసమే నిర్దేశించబడింది. మీ పేరు, వయసు, చదివే తరగతి, పాఠశాల, పిన్‌కోడ్‌తో సహా మీ ఇంటి చిరునామా రాయడం మరిచిపోకండి. పెద్దలకన్నా మీరే చక్కగా రాయగలరని నిరూపించడానికి ఇదొక అరుదైన అవకాశం. అందువల్ల పెద్దల సాయం తీసుకోకండి. ఇక కథను చూద్దాం:*

మంగళాపురంలో మాధవయ్య అనే సంపన్న గృహస్థు ఉండేవాడు. మోహనుడు ఆయన ఏకైక సంతానం. అతడు అందగాడు ; చాలా మంచివాడు. తన కొడుకు స్వభావానికి తగిన మంచి కోడలిని తెచ్చుకోవాలన్నది మాధవయ్య కోరిక.

ధనికుడు కావడం వల్ల మాధవయ్యకు చాలా మంది స్నేహితులున్నారు. వాళ్ళలో ముఖ్యుడు రాఘవయ్య. అతడు ధనవంతుడూ కాడు; పెద్దగా చదువుకున్నవాడూ కాదు. కానీ వివేకవంతుడు. అదే ఊళ్ళో చిన్న బట్టలకొట్టు పెట్టుకుని జీవితం గడుపుతున్నాడు. రాఘవయ్య అంటే మాధవయ్యకు ఎంతో గౌరవం. తనకేదైనా సమస్య ఎదురైనప్పుడు రాఘవయ్య సలహా తీసుకునేవాడు.

రాఘవయ్య కొట్టుకు కొత్తగా చీరలు వచ్చాయంటే - వాటిని తల మీద ఎత్తుకుని ఊరూరూ తిరిగి అమ్మేవాడు. ఆ విధంగా అతనికి ఆ ఊళ్ళోనూ, చుట్టు పక్కల గ్రామాలలోనూ చాలామంది స్త్రీలతో, యువతులతో పరిచయం ఉన్నది.

మాధవయ్య ఒకనాడు రాఘవయ్య దగ్గర తన కొడుకు పెళ్ళి ప్రస్తావనతెచ్చి, ''మిత్రమా! నీవు ఈ చుట్టు పక్కల గ్రామాలలో చాలామంది కన్యలను ఎరుగుదువు కదా! నాకు కోడలుగా రాతగిన అమ్మాయి నీ దృష్టిలో ఎవరైనా వుంటే చెప్పు,'' అని అడిగాడు.

''నిజానికి నేనే నీకావిషయం చెప్పాలనుకున్నాను. రామాపురం ధనశేఖరం అమ్మాయి చందన; కృష్ణాపురం నాగభూషణం గారి కూతురు వందన. ఇద్దరూ చక్కని చుక్కలు.తెలివితేటల్లో ఒకరికొకరు తీసిపోరు. ఈ ఇద్దరిలో ఒకరిని నీ కోడలిగా చేసుకోవచ్చు,'' అన్నాడు రాఘవయ్య.

''ఆడపిల్లకు అందచందాలు, తెలివితేటలు ముఖ్యమే. కానీ, నీతి నిజాయితీలకే నేను ఎక్కువ విలువనిస్తాను. ఆ ఇద్దరిలో ఎవరు ఎక్కువ నిజాయితీ పరులో, నమ్మకస్థులో చెప్పావంటే బావుంటుంది!'' అన్నాడు మాధవయ్య.

''అలాగే! నాకు ఒకవారం అవకాశం ఇవ్వు. ఆ విషయం తెలుసుకొని వస్తాను,'' అన్నాడు రాఘవయ్య.

మిత్రుడి కోరికను రాఘవయ్య ఎలా తీర్చగలిగాడు? ఆ ఇద్దరిలో ఎక్కువ నిజాయితీగల పెళ్ళికూతురును ఆయన ఎలా కనుగొనగలిగాడు? ఆయన నిర్ణయాన్ని మాధవయ్య అంగీకరించాడా? ఈ కథకు చక్కని ముగింపు రాసి, పేరు పెట్టండి. మీ ఎంట్రీలమీద సృజనాత్మక పోటీలకు అని రాసి అక్టోబర్ 30వ తేదీలోగా మాకు చేరేలా పంపండి.

## సెప్టెంబర్ 2000 భారతదర్శనం క్విజ్ సమాధానాలు

1. ఎ. శంకరాచార్యులు.
   బి. అశోకుడు.
   సి. మీరాబాయి.
   డి. అధర్వవేదం.
2. మేవార్ (ఉదయ్‌పూర్) యువరాణి కృష్ణకుమారి. మార్వార్, జోధ్‌పూర్ రాజకుమారులు.




# పుణ్యదానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు చేస్తూన్న శ్రమా, చూపుతూన్న పట్టుదలా అనితర సాధ్యం. నువ్వేదైనా చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం కోరి, పరులకు మేలు చేసి పుణ్యం సంపాదించాలనే ప్రయత్నంలో వున్నావేమో, నాకు తెలియదు. ఐతే, పట్టుదలా, పుణ్యసముపార్జనల ద్వారానే ఎవరూ కార్యసిద్ధిని పొందలేరు. తన కుమారుడి పుణ్యకార్యాల వల్ల సాధించలేని కార్యసిద్ధిని, అతడి తండ్రి అయిన ధనగుప్తుడనే పాపి



సునాయాసంగా సిద్ధింపచేసుకోగలిగాడు. నేనా ధనగుప్తుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

ఒకానొక ఊళ్ళో ధనగుప్తుడనే భాగ్యవంతుడుండేవాడు. ఆయన ఎంగిలి మెతుకులు కాకికి విదిల్చని పరమపిసినారి. ఎందరో అమాయకులను మోసం చేసి, పేదవాళ్ళ కడుపుకొట్టి కోట్లకు పడగలెత్తాడాయన. యాభై ఏళ్ళు పైబడ్డాక ఆయనకు పెద్ద జబ్బుచేసి మంచం పట్టాడు.

అప్పటికి ధనగుప్తుడి ఒక్కగానొక్క కొడుకు గుణగుప్తుడికి సుమారు ముప్ఫై ఏళ్ళు. అతడికి భార్య, ఇద్దరు పిల్లలు వున్నారు. తండ్రి మంచాన పడడంతో, గుణగుప్తుడు మొత్తం ఆస్తివ్యవహారాలన్నీ స్వయంగా చూసుకోవలసివచ్చింది.

స్వతహాగా గుణగుప్తుడు మంచివాడు. ఉదార స్వభావుడు. స్వార్థం తెలియనివాడు. అయితే, పెద్దలను గౌరవించే సంప్రదాయం పాటిస్తాడు కాబట్టి, ఎన్నడూ ఏ విషయంలోనూ తండ్రి మాటకు ఎదురాడ లేదు. ఇప్పుడు తండ్రి మంచంపట్టగానే, ఆయన వద్దన్నా వినకుండా ఘనవైద్యులను రప్పించి వైద్యం చేయించాడు.

ధనగుప్తుడు త్వరలోనే కోలుకున్నాడు కానీ, ఆయనకు గొంతు పూడుకుపోయింది. కుడిచేయి చచ్చుబడిపోయింది. వైద్యులు రకరకాల పరీక్షలు చేసి, ఆయన జబ్బు వైద్యశాస్త్రానికి అంతుపట్టడం లేదని తేల్చారు. గుణగుప్తుడు, తండ్రి ఆరోగ్యం గురించి సాధు పుంగవులను సంప్రదించసాగాడు.

ఒకసారి, మహానందుడనే సాధువు, గుణగుప్తుడి ఇంటికి వచ్చి అతిథి సత్కారాలను అందుకుని, ధనగుప్తుణ్ణి పరీక్షించాడు. తర్వాత కాసేపు కళ్ళు మూసుకున్నాడు. అప్పుడు నెమ్మదిగా ధనగుప్తుడి శరీరం నిమురుతూ, ''నాయనా! నువ్వు ధనసంపాదన కోసం లెక్కలేనన్ని పాపాలు చేశావు. ఆ పాపాలన్నీ నీ కుడిచేతి వ్రాతలతోనూ, నోటిమాటలతోనూ చేయడంవల్ల, నీ శరీరంలోని ఆ రెండుభాగాలూ నీకిప్పుడు అక్కరకు రాకుండాపోయాయి. నీ ఆస్తిని నువ్వు వదులుకుంటే తప్ప నువ్వు మామూలు మనిషివి కాలేవు,'' అన్నాడు.

మహానందుడి సూచన తనకు అంగీకారమే అన్నట్లు, ధనగుప్తుడు తలూపాడు. వెంటనే మహానందుడు చెప్పగా, ఆస్తిని సర్వ హక్కులతోనూ కొడుక్కు ధారాదత్తం చేస్తున్నట్లుగా వీలునామా పత్రాలు తయారు

చేయబడ్డాయి. వాటి మీద చేవ్రాలు చేయ డానికి సిద్ధపడగానే, ధనగుప్తుడికి చేయి మామూలుగా అయిపోయింది. వీలునామా మీద చేవ్రాలు చేయగానే, ఆయనకు ఎప్ప టిలా మాట వచ్చేసింది.

ఇంటిల్లిపాదీ ఆనందోత్సాహాలతో పొంగి పోయారు. ఆ సందర్భంగా గొప్ప వేడుక చేసుకుందామనుకుంటూండగా, గుణ గుప్తుడి పెద్దకొడుకు మణిగుప్తుడు, ఉన్న ట్లుండి పెద్దగా అరిచి పడిపోయాడు. ఏమైందీ అని చూస్తే వాడికి కుడిచేయీ, నోటిమాటా పడిపోయాయి.

"ఇలా జరిగిందేమిటి, స్వామీ!" అని గుణగుప్తుడు, మహానందుడి వద్ద వాపో యాడు. మహానందుడు కాసేపాలోచించి, "నీ తండ్రి పాపాలు నీకంటుకుని, నీ కొడు కును బాధిస్తున్నాయి. నీకు చేరిన ఆస్తి పాపభూయిష్టం. దాన్ని పునీతం చేయా లంటే పుణ్యకార్యాలు చేయాలి. అందుకు నీ తండ్రి ఒప్పుకోడు. కానీ ఇప్పుడు ఆస్తి నీది. కాదంటే మళ్ళీ ఆయనకు జబ్బు తిరగబెడుతుంది. కాబట్టి ఆయన మాటలు పట్టించుకోకుండా, నువ్వు నీకు లభించిన ఆస్తిని సద్వినియోగం చెయ్యి. ఏ రోజున నువ్వు చేసిన పుణ్యాలన్నీ కలిసి, నీ తండ్రి పాపాలను హరిస్తాయో, ఆ రోజున నీ కుమా రుడు మామూలు మనిషవుతాడు. ఇది దైవసంకల్పం," అని చెప్పి వెళ్ళిపోయాడు.

జరిగిన దానికి ధనగుప్తుడు కూడా ఎంతో బాధపడి, "నా మనుమడు, నా ఎదుటే మంచం పడితే చూస్తూ భరించలేను. నా ఆస్తిని నాకిచ్చి, మీరు సుఖంగా వుండండి," అన్నాడు.




గుణగుప్తుడు అందుకు అంగీకరించ లేదు. ధనగుప్తుడు మనవడి పరిస్థితి చూసి భరించలేక, తన పాపాలు కడిగేసుకునేందుకు పుణ్యతీర్థాలకు బయలుదేరాడు.

ఆనాటినుంచీ గుణగుప్తుడు చెయ్యని పుణ్యకార్యం లేదు. ఊళ్ళో ఆలయాన్ని బాగు చేయించి భక్తులకు సదుపాయాలు కలి గించాడు. చక్కని పాఠశాలను ఏర్పాటుచేసి, అందరికీ ఉచిత విద్యాసౌకర్యం కలిగించాడు. అవసరంలోవున్న వారందరికీ సహాయం చేస్తున్నాడు; దానాలు చేస్తున్నాడు.

అలా ఏడాది గడిచింది. ఎంత ఖర్చు పెట్టినా గుణగుప్తుడి ఆదాయం కూడా నానా టికీ వృద్ధి పొందుతున్నది. కొడుకు మణిగుప్తుడి అనారోగ్యం మాత్రం తగ్గలేదు. గుణగుప్తుడి దానధర్మాల సంగతి దేశమంతటా మారు



గుణగుప్తుడు ఆ మాటలు చెవిని పెట్ట కుండా, ''నా పుణ్యకార్యాల వల్ల ఎందరో పేదలు మేలు పొందుతున్నారు. అదే నాకు తృప్తి. ఇప్పటికే వ్యాపారం మూడు పువ్వులూ, ఆరుకాయలుగా వుంది. ఇంతకు మించి దీని మీద దృష్టిసారించడం, నాకు ఇష్టం లేదు,'' అని బంధువులను పంపేశాడు.

ఇలా వుండగా - ఆ దేశపు రాజుకు వీపు మీద రాచపుండు వేసింది. అది ఏ మందుకూ లొంగలేదు. దానితో రాజు ప్రాణాలమీద ఆశవదులుకొని, రాజ్యపాలన మంత్రులకు అప్పగించి, తను సాధువులా, భక్తుల సేవలో కాలంగడపసాగాడు.

ఒకసారి మహానందుడు కూడా రాజును చూడబోయాడు. ఆయన రాజు పరిస్థితికి జాలిపడి, ''మహారాజా! నువ్వు స్వతహాగా సత్పురుషుడవే అయినా, రాజువు కావడం వల్ల తెలిసో తెలియకో కొన్ని అన్యాయాలు చేశావు. నీ కారణంగా కొందరు నిర్దోషులు శిక్షలకు గురయ్యారు. కొందరు దోషులు శిక్షలు తప్పించుకొని మరిన్ని పాపాలు చేస్తు న్నారు. ఆ పాపాలే నీకు వీపు మీద రాచ పుండయ్యాయి. ఈ పుండు ఏ మందు లకూ లొంగదు. నీ దేశపౌరుల్లో ఎవరైనా తమ పుణ్యాన్ని నిండుమనసుతో నీకు ధార పోస్తే, ఆ పుణ్యం నీకు సరిపోతే - వెంటనే నీ పుండు మానుతుంది,'' అని చెప్పాడు.

''అంతటి మహాపుణ్యాత్ముడు ఎవరో, ఎక్కడున్నాడో తమర్లే సెలవివ్వండి స్వామీ!'' అని రాజు, మహానందుణ్ణి వేడుకున్నాడు.

మహానందుడు వెంటనే గుణగుప్తుడి పేరు చెప్పాడు. రాజు భటులను పంపి

మ్రోగిపోయింది. అతడికి మహాపుణ్యా త్ముడుగా గొప్ప పేరు వచ్చింది.

గుణగుప్తుడికి మాత్రం తనకు వచ్చిన పేరు ఏమాత్రం తృప్తినివ్వలేదు. అతడు ప్రతిరోజూ కుమారుడి దగ్గరకు వెళ్ళి ఒళ్ళంతా నిమిరి కళ్ళనీళ్ళు పెట్టుకునేవాడు. నేనెంత పుణ్యం చేసినా అది వృథాగా పోతున్నదని బాధపడేవాడు.

కొందరు బంధువులు గుణగుప్తుడి చుట్టూ చేరి, ''నీ పుణ్యం నీకేం మేలుచేసింది? సంపాదించినదంతా అడ్డమైనవాళ్ళకూ పంచి పెట్టడం పుణ్యం అనిపించుకోలేదని తేలి పోయింది. నువ్విక పుణ్యకార్యాలు మాని వేసి, నీ వ్యాపారాన్ని ఇతర ప్రాంతాలక్కూడా వ్యాపింపచెయ్యి. మేము నీకు సాయపడతాం,'' అని చెప్పారు.

గుణగుప్తుణ్ణి వెంటబెట్టుకు రమ్మన్నాడు. గుణగుప్తుడు రాగానే తన కోరిక చెప్పాడు.

అది విన్న గుణగుప్తుడు, ''ప్రభూ! నా పుణ్యం నా కొడుకు జబ్బును రవంతకూడా తగ్గించలేకపోయింది. అది మీకు ప్రయోజనం కలిగిస్తుందని, నాకు నమ్మకం లేదు,'' అన్నాడు వినయంగా.

అప్పుడు మహానందుడు, ''గుణగుప్తా! నీ తండ్రి పాపాలు నీ కొడుకు స్వీకరించాడు. ఆ విధంగా ఆయన ఆస్తి పునీతమైంది. నీవాయన ఆస్తితో పుణ్యకార్యాలు చేశావు. ఆ పుణ్యం కారణంగా నీ ఆస్తి ఏడాదిలోనే మూడు రెట్లయింది. నీ పుణ్యం పనికిరాలేదనుకోవడం, నీ అవివేకం,'' అన్నాడు.

''స్వామీ! నేను ఆస్తి సంపాదించాలని పుణ్యకార్యాలు చేయడంలేదు. నాక్కావలసింది నా కొడుకు ఆరోగ్యం,'' అన్నాడు గుణగుప్తుడు నిరాసక్తంగా.

''నీ ఆస్తి పెరగడం అందుకే. ఇప్పుడు నీ ఆస్తిలో ఒకవంతు నీ తండ్రిది. మూడు వంతులు నీది. అందువల్ల ఇకమీదట నువ్వు చేసిన పుణ్యంలో కూడా మూడు వంతులు, నీకు దక్కుతుంది. ఇతరుల ఆస్తితో పుణ్యకార్యాలు చేస్తే, అది నీ ఆస్తి పెరుగుదలకే తప్ప సహకరించదు. నీ ఆస్తితో చేసిన పుణ్యకార్యాలే, నీ కోర్కె తీర్చగలవు. ఇప్పుడు నువ్వు సంపాదించిన పుణ్యం, నీ కొడుకు జబ్బు నయం చేయలేకపోయినా, రాజుగారి పుండును నయం చేయగలదు,'' అన్నాడు మహానందుడు.

ఇందుకు గుణగుప్తుడు ఆశ్చర్యపోయి, ''అంటే, ఇప్పుడిప్పుడే నావద్ద కోర్కెలు తీర్చే




పుణ్యం చేరుతున్నదన్నమాట. ఉన్న పుణ్యం కాస్తా మహారాజుకు దానం చేస్తే, మళ్ళీ నా కథ మొదటికి వస్తుందన్నమాట. స్వామీ, నేనిప్పుడేం చేయాలి?'' అని అడిగాడు.

''అది నీ నిర్ణయానికే విడిచిపెడుతున్నాను,'' అన్నాడు మహానందుడు.

గుణగుప్తుడు కాసేపాలోచించి, ''నా పుణ్యంతో మహారాజు రాచపుండు నయమైపోతే, ఇప్పుడే దాన్ని దానం చేయడం బాగుంటుంది. ఎందుకంటే, నా కొడుకు జబ్బు నయం కావడానికి ఇంకా ఎన్ని సంవత్సరాలు వేచి వుండాలో నాకు తెలియదు. అన్నేళ్ళు ఆగేవాడు, మరొక్క ఏడు ఆగలేకపోడు,'' అంటూ తన నిర్ణయం చెప్పాడు.

మహానందుడి ఆధ్వర్యంలో మంత్రోచ్చారణల మధ్య గుణగుప్తుడు తన పుణ్యాన్ని

రాజుకు ధారపోశాడు. విచిత్రంగా వెంటనే రాజు వీపు మీది పుండు నయమైంది.

రాజు ఎంతో సంతోషించి, గుణగుప్తుడు కోరినదిస్తానన్నాడు. గుణగుప్తుడు తల అడ్డంగా ఊపి, ''ప్రభూ ! నాకేమివ్వదల చారో దాంతో ప్రజోపయోగకరకార్యాలు చేయండి. మీ ఆరోగ్యమే నాకు తృప్తినిచ్చింది,'' అంటూ రాజువద్ద సెలవు తీసుకున్నాడు.

గుణగుప్తుడితోపాటు సాధువు మహానందుడు కూడా అతడి ఊరికి వెళ్ళేసరికి, తీర్థయాత్రలు ముగించుకుని ధనగుప్తుడు తిరిగివచ్చాడు. విచిత్రమేమిటంటే – ఆయన తెచ్చిన గంగాజలం సేవించి మణిగుప్తుడు మామూలు మనిషైపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, గుణగుప్తుడు ఎన్నో పుణ్యకార్యాలు చేశాడు. రాజ్యంలో ప్రతి ఒక్కరూ అతణ్ణి గొప్ప పుణ్యాత్ముడుగా ప్రశంసిస్తున్నారు. అలాంటి వాడి పుణ్యాల వల్ల మణిగుప్తుడి వ్యాధి నయం కాలేదు కానీ, ధనగుప్తుడి వంటి పాపాత్ముడి తీర్థ యాత్రల వల్ల, అతడి వ్యాధి నయమైంది. ఇలా ఎందుకు జరిగింది? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఎప్పుడైతే ధనగుప్తుడు తన ఆస్తిని కొడుక్కు విడిచిపెట్టి, మనమడి ఆరోగ్యం కోసం తీర్థయాత్రలకు బయల్దేరాడో, ఆ క్షణం నుంచీ ఆయన పాపాత్ముడు కాదు. అయితే, మణిగుప్తుడి ఆరోగ్యం కుదుటబడటానికి కారణం మాత్రం, ఆయన తెచ్చిన గంగాజలం కాదు; గుణగుప్తుడు చేసిన పుణ్యమే! అంతకాలం కొడుకు జబ్బు నయం కావాలనే స్వార్థంతో చేసిన పుణ్యాలకంటే, ఏ స్వార్థమూ లేకుండా, రాజు జబ్బు నయంకావాలనుకున్న పుణ్యమే, గుణగుప్తుడికి ఎన్నో రెట్లు ప్రయోజనకారి అయింది. ఎన్ని దానధర్మాలు చేసినా, పుణ్యాన్ని దానం చేయడాన్ని మించినపుణ్యకార్యం మరొకటి లేదు. గుణగుప్తుడి పుణ్యదానమే, మణిగుప్తుడి జబ్బు నయం చేసింది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : ''వసుంధర'' రచన]



# దొంగల భయం

పరంధామయ్య అనే రైతు, తన కుమార్తె పెళ్ళి శుభలేఖలను, తన బంధువులకూ, స్నేహితులకూ మనుషుల ద్వారా పంపుతూ – పెళ్ళికి వచ్చే ఆడవారు నగానట్రా పెట్టుకు రావద్దనీ, తనున్న ప్రాంతాల్లో దోపిడీదొంగల భయం ఎక్కువగా వుందనీ కబురు చేశాడు.

వారం రోజుల తర్వాత ఆడవారు, ఎలాంటి నగలూ లేకుండా పెళ్ళికి హాజరయ్యారు. పెళ్ళిలో అందరూ కలివిడిగా మాట్లాడుకుంటూ సంతోషంగా కాలంగడిపారు.

బంధుగణమంతా తిరుగుప్రయాణమై వెళ్ళిపోయేరోజున, ఒకావిడ పరంధామయ్యతో దొంగల ప్రస్తావన తెచ్చి, "ఈ ప్రాంతాల దోపిడీదొంగల భయమంటూ లేదని గ్రామంలో చాలామంది చెప్పారు. మీరేమో వాళ్ళ భయం వుందనీ, నగలు పెట్టుకురావద్దనీ కబురు పంపారు. ఇలా ఎందుకు చేశారు?" అని అడిగింది.

దానికి పరంధామయ్య నవ్వి, "నా బంధువుల్లో కలిగిన వాళ్ళున్నారు, లేనివాళ్ళూ చాలా మంది వున్నారు. అందువల్ల ఉన్నమ్మ, లేనమ్మను చూసి గర్వపడకూడదు; లేనమ్మ, ఉన్నమ్మను చూసి అసూయపడకూడదు! ఈ అంతరాలు లేనప్పుడే, అంతాకలిసిమెలిసి వుండగలరు. అందుకే, నేను లేని దొంగల్ని సృష్టించాను," అన్నాడు.

– చిలకలూరి విజయలక్ష్మి



# అందరికీ ఆనంద దీపావళి!

మళ్ళీ దీపావళి వచ్చింది. పిల్లలకూ, పెద్దలకూ, పాఠకులందరికీ చందమామ దీపావళి శుభాకాంక్షలు అందజేస్తోంది. ఈ దీపావళి శుభ సందర్భంగా బాలబాలికల కళ్ళు ఆనందంతో మెరిసిపోతూ, వారి నవ్వులు, కేరింతలు పండుగను మరింత శోభాయమానం చేయాలని ఆశిస్తున్నాము.

పండుగను ఎలా జరుపుకోవాలి? ఏమేం కొనాలి? ఏ ఏ తినుబండారాలు తినాలి? ఎవరెవరిని ఎక్కడెక్కడ కలుసుకోవాలి? మొదలైన వాటిని ఆలోచిస్తూ పిల్లలందరూ ఇప్పటికే హడావుడిగా ఉంటారు. అవునా? మేమూ మీకు రెండు జాబితాలు ఇస్తున్నాం. ఏమేం చేయాలి? ఏమేం చేయకూడదు? అన్నవి ఈ జాబితాలు సూచిస్తాయి. ఈ దీపావళిని అపస్వరం లేకుండా హాయిగా, ఆనందంగా, సురక్షితంగా జరుపుకోవడానికి ఇవి ఉపయోగపడతాయి.

ఇదిగో మొదటి జాబితా. తప్పకుండా ఏమేం చేయాలి? అన్న విషయాలు ఇందులో ఉన్నాయి :

✔ కాకరొత్తులు, చిచ్చుబుడ్లు మొదలైన టపాకాయలు కాల్చేప్పుడు పక్కన మీ పెద్దలు ఉండేలా చూసుకోండి.

✔ టపాకాయలు కాల్చేప్పుడు చెప్పులు తొడుక్కోవడం అవసరం. చెప్పులులేకుండా రోడ్లో నడవకండి. ఆరీఆరకుండా నిప్పుతో వున్న టపాకాయల మీద అడుగువేయవచ్చు. అది విపరీతమైన పర్యవసానాలకు దారితీస్తుంది.

✔ టపాకాయలకు నిప్పంటించడానికి అగరు వత్తి కడ్డీలనే ఉపయోగించండి.

✔ కాల్చేసిన టపాకాయలను, దారిలోనుంచి తీసేయండి. వాటిపై నీళ్ళు చల్లి ఒక పక్కగా పోగుచేయండి.

✔ ఎప్పుడూ ఒక బకెట్ నీళ్ళు సిద్ధంగా అందుబాటులో ఉంచుకోండి.

ఏవేవి చేయకూడదు అవి తెలియజేసే రెండవ జాబితా :

✗ టపాకాయలకు నిప్పంటించడానికి దయచేసి అగ్గిపుల్లలను ఉపయోగించకండి. అగరువత్తి కడ్డీనిగాని, కాకరొత్తిని గాని ఉపయోగించండి.

✗ టపాకాయలకు నిప్పంటించి చుట్టుపక్కలకు విసరకండి. వాటిని నేలపైన వుంచి ఆపైన నిప్పంటించండి.

✗ టపాకాయలు కాల్చేప్పుడు నైలాన్, సింథటిక్ దుస్తులను ధరించకండి. నిప్పంటుకుంటే అవి క్షణంలో భగ్గున కాలిపోతాయి. ప్రత్తి బట్టలను మాత్రమే ధరించండి.

✗ ఇంటిలోపల టపాకాయలు కాల్చకండి. వెలుపలి వాకిట్లో కాల్చండి.

✗ తెరిచివున్న ఫ్యూజ్ బాక్సులు, ట్రాన్స్‌ఫార్మర్లు, అలాంటి ఇతర పరికరాలున్న పరిసరాలలో బాణాసంచా పేల్చకూడదు. అగ్నిప్రమాదాలు జరగవచ్చు.

✗ ఆగివున్న వాహనాల సమీపంలో, కిరసనాయిలు, పెట్రోలు, డీజల్ మొదలైన సులభంగా నిప్పంటుకునే ఇంధనాలు భద్రపరిచిన చోటికి సమీపంలో టపాకాయలు కాల్చకూడదు.

✗ ముందుకు వంగి టపాకాయలకు నిప్పంటించకండి. నిటారుగా నిలబడి, మీ చేతులను మాత్రమే వంచి టపాకాయలను కాల్చండి. దీనివల్ల ముఖానికీ, చేతులకూ గాయం తగల కుండా జాగ్రత్త పడవచ్చు.

దీపావళిని సరదాగా జరుపుకోండి!



# కాలిన గాయాలకు ప్రథమ చికిత్స

దీపావళి సమయంలో రకరకాల ప్రమాదాలు జరుగుతూ ఉంటాయి. ముఖ్యంగా అగ్నిప్రమాదాలు. వీటివల్ల ఒళ్ళు కాలి బాధాకరమైన గాయాలు ఏర్పడతాయి. అలాంటివి జరగకూడదనే ఆశిస్తున్నాము. అయితే, టపాకాయలు కాలుస్తున్నప్పుడు ఒకవేళ ఒళ్ళు కాలితే వెంటనే ఏంచేయాలి? ప్రథమ చికిత్స చిట్కాలు కొన్ని ఇక్కడ చూడండి :

గాయం తగిలిన చోటును చల్లటి నీళ్ళతోగాని, కొళాయి నీటితోగాని శుభ్రంగా కడగాలి. మంట, ఇబ్బంది తగ్గేంతవరకు గాయం మీద నీళ్ళుపోస్తూ ఉండాలి. అయితే ఐస్‌లా మరీ చల్లటి నీళ్ళతో కడగకూడదు.

వక్షస్థలం, కడుపు, కడుపు దిగువున కాలిన గాయం ఏర్పడినట్టయితే, ధరించిన దుస్తులను తీసివేయడానికి ప్రయత్నించకండి. అది మరింత బాధను కలిగిస్తుంది. దానికి బదులు ఆ చోటును నీటితో తడపండి.

గాయం తగిలిన చోటుకు దాపుల రాసుకునేలా ఉన్న గాజులు, ఉంగరాలు, దండలు మొదలైన వాటిని తీసివేయండి. లేకుంటే అవి తగిలినప్పుడల్లా బాధ ఎక్కువవుతుంది.

గాయం మీద నూనెగాని, జిగటగా వున్న క్రీములుగాని రాయకూడదు. ఎందుకంటే ఆ తరవాత శుభ్రం చేయడం, కట్టుగట్టడం కష్టమవుతుంది.

కంటిలో నిప్పురవ్వలాంటిది పడినప్పుడు మంట అణిగేంతవరకు నెమ్మదిగా బాగా కడగాలి.

పైపైన తగిలిన నిప్పుగాయాలకు మందువేసి, కట్టుగట్టడం అవసరం లేదు. అయితే పెద్దగాయాలకు సరిగ్గా శుభ్రం చేయడం, కట్టుగట్టడం చాలా అవసరం.

బొబ్బలను అలాగే వదిలేయండి. వాటిని గిల్లకండి. గిల్లితే చీము పట్టవచ్చు. వాటంతట అవే మానేలా అలాగే వదిలివేయండి.

అన్నిటికీ మించి గాయాలకు చికిత్సచేయకుండా ఉదాసీనం చేయడం అత్యంత ప్రమాదకరం. గాయం తగిలిన వెంటనే ప్రథమ చికిత్స చేసి ఫ్యామిలీ డాక్టర్ దగ్గరికి వెళ్ళండి.

మరొక ప్రధాన విషయం ఏమంటే ప్రమాదం జరిగాక అవస్థపడడం కన్నా, అది జరక్కుండా హెచ్చరికగా ఉండడం ఉత్తమం. కొన్ని ముఖ్యమైన జాగ్రత్తలు పాటిస్తూ టపాకాయలు పేల్చామంటే ఎలాంటి అపాయమూ లేకుండా దీపావళిని హాయిగా, ఆనందంగా గడిపేయవచ్చు!

మళ్ళీ ఒకసారి అందరికీ ఆనంద
దీపావళి శుభాకాంక్షలు!



## ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

జాతిపితగా, మహాత్మాగాంధీగా భారత ప్రజల మన్నన లందుకున్న మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ, గుజరాత్ లోని పోర్‌బందర్ పట్టణంలో 1869 అక్టోబర్ 2వ తేదీ జన్మించాడు. ఆయన తండ్రి కాబా గాంధీ పోర్ బందర్ రాజాస్థానంలో మంత్రిగా ఉండేవారు.

గాంధీజీని పద్ధెనిమిదవ యేట న్యాయవిద్య నభ్యసించడానికి లండన్‌కు పంపారు. మూడేళ్ళలో ఆయన బారిష్టర్‌గా స్వదేశానికి తిరిగివచ్చాడు. అప్పటికే ఆయనకు కస్తూరిబాయితో వివాహ మయింది. 1944వ సం॥ లో ఆమె మరణించేంతవరకు ఆదర్శ పత్నిగా గాంధీజీకి బాసటగా నిలిచింది.



## మహాత్మా గాంధి

1892వ సం॥ లో గాంధీజీ న్యాయవాద వృత్తిరీత్యా దక్షిణాఫ్రికాకు వెళ్ళాడు. అది కూడా మనదేశంలాగే ఆంగ్లేయుల వలసరాజ్యంగా ఉండేది. పాలకులైన తెల్లవారు పాలితులైన నల్ల వారిపై సాగించే దురాగతాలు చూసి గాంధీజీ బాధపడ్డాడు. ఆయనకు కొన్ని చేదు అనుభవాలు ఎదురయ్యాయి. ఒకసారి ఆయన రైల్లో మొదటి తరగతి పెట్టెలోకి ఎక్కాడు. అదే పెట్టెలో ప్రయాణం చేస్తూన్న తెల్ల వాడికి అది నచ్చలేదు. తనకు సమానంగా ఒక భారతీయుడు రావడం అతడికి ఇష్టం లేదు. అందువల్ల తెల్ల అధికారులు గాంధీజీని నిర్దాక్షిణ్యంగా బయటికి గెంటేశారు. ఆంగ్లేయుల జాత్యహంకారాన్ని వ్యతిరేకించి, ఆదాయం తెచ్చే న్యాయవాదవృత్తిని కూడా పక్కనపెట్టి, అక్కడి భారతీయుల న్యాయమైన హక్కులకోసం గాంధీజీ పోరాడాడు.

1914వ సం॥ లో ఆయన భారతదేశానికి తిరిగి వచ్చాడు. నాలుగేళ్ళ తరవాత బీహార్‌లో విదేశీయులైన నీలిమందు పంట సాగుచేసేవాళ్ళు జరుపుతున్న అణచివేతకు వ్యతిరేకంగా చంపారన్ రైతులతో అహింసాత్మకమైన పోరాటం సాగించాడు. 1919లో జరిగిన జలియన్ వాలాబాగ్ దురంతాలలో అసంఖ్యాకులైన అమాయకులు ఊచకోతకు లోనయ్యారు. అది పరాయి పాలకుల రాక్షస కృత్యాలకు పరాకాష్ఠ అయింది. గాంధీజీ సహాయనిరాకరణోద్యమానికి పిలుపునిచ్చాడు. ఒక్క సంవత్సరంలోగా ఆయన భారత జాతీయ కాంగ్రెస్‌కు తిరుగులేని నాయకుడయ్యాడు. సహాయనిరాకరణోద్యమం, విదేశ వస్తుబహిష్కరణ ఉద్యమం ఊపు అందుకున్నాయి.

మనదేశంలోని సాంఘిక దురాచారాలు, పేదరికం గాంధీజీ దృష్టిని ఆకర్షించాయి. పేదలకు ఆర్థిక స్వావలంబన కలిగించడానికి రాట్నంపై నూలు వడకడం లాంటి కుటీర పరిశ్రమలు నెలకొల్పాలనుకున్నాడు. అంటరానితనం రూపుమాపడానికి కృషి చేశాడు. ప్రభుత్వానికి పన్ను చెల్లించకుండా సముద్రజలాల నుంచి ప్రజలే ఉప్పు తయారుచేసుకోవాలని ప్రభోదిస్తూ 1930 వ సం॥ లో ఆయన సబర్మతి నుంచి దండి వరకు ఉప్పు సత్యాగ్రహయాత్ర చేశాడు. దేశవ్యాప్తంగానూ ఈ ఉద్యమం జరిగింది. వేలాదిమంది జైళ్ళపాలయ్యారు. పాలకుల హింసలకు గురయ్యారు. గాంధీజీ అప్పటినుంచి స్వాతంత్ర్యం సిద్ధించేంతవరకు వివిధ ఉద్యమాలు జరిపి అనేక సార్లు జైలు పాలయ్యాడు. ఆఖరికి 1942 ఆగస్ట్ 9వ తేది తెల్లదొరలూ వదలివెళ్ళండి అనే 'క్విట్ ఇండియా' ఉద్యమానికి పిలుపునిచ్చాడు.

ఇక భారత్‌ను వదిలివెళ్ళడం తప్పదని గ్రహించిన ఆంగ్లేయులు మతమైషమ్య విషబీజాలు నాటారు. 1947 ఆగస్టు 15వ తేదీ దేశం స్వాతంత్ర్యం సాధించింది. అయితే, అప్పుడే భారతదేశం నుంచి పాకిస్తాన్ విడిపోయింది.

ఒక మతం వారిని తృప్తిపరచడానికి గాంధీజీ అవలంబించిన మెతకవైఖరే దేశవిభజనకు దారితీసిందని కొందరు భావించారు. అలా భావించిన వారిలో ఒకడు 1949 జనవరి 30వ తేదీ ప్రార్థనా సమావేశంలో వున్న గాంధీజీని కాల్చిచంపాడు!




# స్వర్ణసింహాసనం

**11**

[కౌండిన్యదేశ రాజధానీ నగరంలో జరిపిన త్రవ్వకాలలో అపూర్వ స్వర్ణసింహాసనం ఒకటి బయటపడింది. యువరాజు విజయదత్తుడు పట్టాభిషేకానికి సంసిద్ధుడై స్వర్ణసింహాసనాన్ని అధిరోహించబోయాడు. సాలభంజికల రూపంలో తొలి రెండు మెట్లమీద వున్న సత్యశక్తి, ధర్మశక్తి అడిగిన ప్రశ్నలకు విజయదత్తుడు సరైన సమాధానాలు చెప్పి మెప్పించాడు. మూడవ మెట్టు మీది న్యాయ సాలభంజిక విజయదత్తుడి న్యాయనిర్ణయశక్తిని పరీక్షించడానికి - న్యాయవర్ధన మహారాజు సమక్షానికి వచ్చిన మూడు తగవుల గురించి వివరించసాగింది. — తరవాత ]

న్యాయవర్ధన మహారాజు రత్నగుప్తుడికీ, మణికర్ణుడికీ సలహాలిచ్చి పంపడంతో ఆనాటి న్యాయవిచారణ పూర్తయింది.

అంతా శ్రద్ధగా విన్న కుమారకేతు, ఆ క్షణం నుంచీ, రాత్రి భోజనానంతరం, మహారాజును మందిరంలో కలుసుకునే దాకా, న్యాయవిచారణ గురించే ఆలోచించాడు.

రాత్రి, మహారాజు, కుమారకేతును ఆప్యాయంగా చేరబిలిచి, ''నాయనా, ఉదయం న్యాయవిచారణ అంతా చూశావు గదా? ఇక్కడ నీకు నేను ఒకే ఒక్క విషయం చెబుతాను, విను! వర్తక ప్రముఖుడైన రత్నగుప్తుడికి ఒకే ఒక్క కుమారుడు. అతడి పేరు హేమగుప్తుడు. అతడు జూదరి, తాగుబోతు, తిరుగుబోతు. అధముల్లోకెల్లా అధమాధముడు. తండ్రి వారం రోజుల్లో సంపాదించినదాన్ని, ఒక్క గంటలో మాయం చెయ్యగలడు. ఇదీ అతడి సంగతి! ఇక, ఈనాటి మూడు తగవుల

లక్ష్మీ గాయత్రి



న్యాయవిచారణ గురించిన పూర్తి వ్యాఖ్యానం నువ్వే చెప్పు వింటాను!'' అన్నాడు.

రాజు న్యాయవర్ధనుడు చెప్పిన ఆ ఒక్క సంగతీ వినగానే, కుమారకేతు ముఖం వికసించింది.

ఇంతవరకూ చెప్పి ఆపిన సాలభంజిక, విజయదత్తుడితో, ''యువరాజా! న్యాయవర్ధన మహారాజులో వున్నంత న్యాయవిచక్షణ, నీలో కూడా వున్నదా? ఉన్నట్లయితే, న్యాయవర్ధనుడు అడిగిన పూర్తి వ్యాఖ్యానాన్ని కుమారకేతుకంటే చక్కగా, నువ్వే చెప్ప గలవు! అలా చెప్పగలిగావా, ఈ అపురూపమైన ధర్మపీఠాన్ని... ముల్లోకాల్లోనూ అద్వితీయమైన ఈ స్వర్ణసింహాసనాన్ని, ఇక ఏ ఆటంకమూ లేకుండా పూర్తి హక్కుతో అధిరోహించటమే గాకుండా, సింహాసన సృష్టికర్త అయిన పుళింద భట్టారకుడి మరొక అపురూపసృష్టి - మంత్రపూతమైన ఖడ్గం చంద్రహాసాన్ని కూడా బహుమానంగా పొంద గలుగుతావు. అలా కాని పక్షంలో, ఇప్పటి వరకూ నువ్వు పడిన శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరవుతుంది. ఈ క్షణాన నీ కళ్ళ ముందు ధగద్ధగాయమానంగా ప్రకాశిస్తున్న, ఈ స్వర్ణసింహాసనం, నువ్వు జవాబు చెప్పలేక ఓటమిని అంగీకరించిన ఉత్తరక్షణంలో మాయమై, తిరిగి స్వస్థానాన్ని చేరుకుంటుంది. కనక, ఓ, విజయదత్తా, ప్రయత్నించు! విజయీభవ, దిగ్విజయీ భవ!'' అని మౌనం వహించింది.

అంతా శ్రద్ధగా విన్న విజయదత్తుడు, వెంటనే, ''ఓ న్యాయశక్తీ! నా విచక్షణాజ్ఞానం గురించీ, ఆలోచనాశక్తి గురించీ, నేనే చెప్పుకోవటం అంత మర్యాదపూర్వకమైన పని కాదు. నా వ్యాఖ్యానం అంతా విన్న తర్వాత, నా శక్తియుక్తుల్ని నిర్ణయించే బాధ్యత, దివ్యశక్తివైన నీదే!'' అంటూ ఇలా ప్రారంభించాడు :

''మొత్తం మానవజాతిని, మూడు తరగతులుగా విభజించవచ్చు. అది ఉత్తమ, మధ్యమ, అధమ తరగతులు. తమ తమ బుద్ధుల్నీ సంస్కారాన్నీ బట్టి, ప్రతి మనిషీ ఈ మూడింటిలోనూ, ఏదో ఒక తరగతికి చెందుతాడు. న్యాయం కోరి తన దగ్గరకు వచ్చిన వ్యక్తులు, ఈ మూడు తరగతుల్లో దేనికి చెందుతారన్న విషయాన్ని రాజు తన సూక్ష్మబుద్ధితో గ్రహించగలగాలి. రాజు ఆ విషయాన్ని ఎంత బాగా గ్రహిస్తే, అంత చక్కటి తీర్పు ఇవ్వగలుగుతాడు. అది, ఎలా అంటే — ఉత్తముడైన దోషికి దండ

నగా చిన్న మాట చాలు. మధ్యముడికి కాస్త వివరణా, చిన్న పాటి శిక్షా సరిపోతుంది. అధముడు చిన్న పాముతో సమానం. చిన్న పామునైనా పెద్ద కర్రతో కొట్టమన్న సామెతగా, అధముడి నేరం చిన్నదైనప్పటికీ, అతడిని పెద్దగా బెదరగొట్టటం తప్పని సరి! దండంతో దండన కూడా తప్పని సరే!

ఆత్మాభిమానం గలవాడూ, చిన్న నేరమైనా సరే చేసినందుకు కుమిలిపోయేవాడూ, ఉత్తముడైన దోషి. పరిస్థితుల ప్రాబల్యం వల్ల తప్పు చేసి, ఆవేశం కాస్తా తగ్గగానే నేరాన్ని అంగీకరించేవాడు, మధ్యమదోషి. తను తప్పు చేస్తున్నందుకు బాధపడకపోగా, తప్పు చేసి నట్టు అంగీకరించను కూడా అంగీకరించని వాడు అధముడు.

రాజు, తన దగ్గరకు వచ్చిన వ్యక్తులు, పై మూడింటిలో ఏ తరగతివారో తేల్చుకు న్నాక, విచారణ సాగించి తీర్పు ఇవ్వాలి. న్యాయపాలనలో ఇది అతి ముఖ్యమైన మొదటి సూత్రం.

ఇదిగాక, రాజు, తన రాజ్యంలోని ప్రముఖ వ్యక్తుల వివరాలు కూడా, ఎప్పటి కప్పుడు సేకరిస్తూ వుండాలి. వారి జీవన విధానమూ, కొంతవరకు అయినా వారి ఆంతరంగిక జీవితమూ రాజుకు తెలిసి వుండాలి. ఈ విషయంలో రాజుకు, దేశీయ గూఢచారిదళం బాగా సహకరిస్తుంది.

ఇక న్యాయవర్ధనుడు విచారించిన మూడు తగవుల్లోనూ, మొదటి దాంట్లోని దోషి వీరనందుడు మధ్యమ తరగతివాడు. అతడు చేసిన తప్పూ, రాజుతీర్పూ అన్నీ తేట తెల్లంగా, బహుజన ప్రశంసనీయంగా,



న్యాయ సూత్రాలకే కొత్త వన్నె తెచ్చేలా వున్నది.

ఇక, రెండవ తగవులో దోషి రత్నగుప్తుడు! అతడు ఉత్తమదోషి గనక, విచారణా, తీర్పూ, అన్నీ గూఢంగా సాగాయి. రాజు ఎవరిని దోషిగా నిర్ణయించాడో, తీర్పు ఏమిటో, చివరకు ఫిర్యాదీ అయిన మణికర్ణుడికి కూడా అంతుచిక్కలేదు. ఈ తగవునూ, దీంట్లో రాజు తీర్పునూ అర్థం చేసుకోవా లంటే, సుభద్ర దేశప్రముఖుల్లో ఒకడైన రత్నగుప్తుడి ఆంతరంగిక జీవన సరళి కొంత తెలుసుకోవాలి.

రత్నగుప్తుడు నిజాయితీపరుడూ, మంచి వాడూ. వర్తకులు బేరసారాలు సాగించే చోట మణికర్ణుడు విచారించినప్పుడు, అక్కడి వర్తకులూ, సామాన్యులూ అంతా చెప్పిన



యితీపరుడు నేరం చేసినప్పుడు, 'నేను చెయ్యలేదు' అని ఊరుకుంటాడే తప్ప, తాను నిర్దోషినంటూ కథలు కల్పించి చెప్ప లేడు. రత్నగుప్తుడు అదే పని చేశాడు. దాంతో రాజు అనుమానం బలపడింది. 'మీ కుమారుడు కుశలమే గదా?' అంటూ మరొక బాణం వేసి చూశాడు. ఆ ప్రశ్న వినగానే, 'మేధావి అయిన రాజు, కొడుకు కోసం, నేనీ నేరం చేశానని గ్రహించేశాడు,' అనుకున్న రత్నగుప్తుడి ముఖం కళ తప్పింది. అది చూసిన రాజు, అతణ్ణి దోషిగా మనసు లోనే నిశ్చయించి, ఏకాంతంలోకి పంపాడు.

ఉత్తమ దోషికి అతడి అంతరంగమే, ఒక పెద్ద న్యాయాధికారి! ఆ న్యాయాధికారి ఏకాంతంలో మరింత విజృంభిస్తాడు. నువ్వు చేసింది తప్పు అంటూ ఘోష పెడతాడు.

రత్నగుప్తుడు కూడా ఏకాంతంలో అలాంటి వ్యథే అనుభవించటంతో, తిరిగి వచ్చేసరికి అతడి ముఖం మరింత పాలిపోయింది. వెంటనే రాజు, రత్నగుప్తుడి పరువు మర్యాదలకు భంగం రాకుండా, "మణికర్ణుడు నీకు పుత్రసమానుడు! నువ్వు అతడిని తండ్రిలా ఆదరించాలే తప్ప, ఇటువంటి అకార్యం చేయరాదు!" అన్న అర్థం వచ్చేలా గూఢంగా మాట్లాడి ఊరుకున్నాడు. స్వత హాగా తెలివైన రత్నగుప్తుడికి, రాజు హెచ్చరిక అర్థమైంది. రాజు తనను అవమానపరచ నందుకు కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. ఇంటికి వెళ్ళిన తర్వాత రత్నగుప్తుడు, మణికర్ణుడి వర్తకపు సరుకు తిరిగి అతడికి ఇచ్చి వేసిందీ, లేనిదీ స్వయంగా మణికర్ణుడి నుంచే వినటం కోసం, రత్నగుప్తుడి గుట్టు ఎక్కడా

సత్యమది. అటువంటివాడు నేరం చెయ్యాలి అంటే, దానికితగినబలమైనకారణం వుండాలి. ఆ కారణం రత్నగుప్తుడి ఏకైక సంతానం హేమగుప్తుడు! దుర్వ్యసనపరుడైన కొడుకు, తండ్రి సంపాదన అంతా చిటికెలో నాశనం చేస్తుంటే, ఆ తండ్రి సాధ్యమైనంత వరకు కొడుకును అదుపుచెయ్య జూస్తాడు. అది సాధ్యం కానినాడు, తనే మరింత సంపాదించి, కొడుకు భవిష్యత్తు కోసం దాచాలని తహ తహ లాడతాడు.

న్యాయవర్ధన మహారాజుకు, రత్నగుప్తుడి జీవితం అంతా తెలుసు. అతడి కొడుకు, అతడి చేయిదాటిపోయాడని కూడా తెలుసు. అందుచేత, రత్నగుప్తుడు సులభ సంపాదన కోసం, ఈ విదేశీయువకుణ్ణి మోసం చేసి వుండవచ్చుకదా అని ఆలోచించాడు. నిజా

బైట పెట్టవద్దని అతణ్ణి హెచ్చరించటం కోసం, మర్నాడు మణికర్ణుణ్ణి, తన దగ్గరకు ఒక్కణ్ణే రమ్మని చెప్పాడు.

నిగూఢంగా సాగినరెండవతగవు తాలూకు స్థూలస్వరూపం ఇది!

ఇక, మూడవ తగవులో దోషి ముసలమ్మ అధమ తరగతికి చెందిన మూర్ఖురాలు. అందుకే, రాజు ఆమెతో అత్యంత కఠినంగా వ్యవహరించి, కారాగారానికి పంపించాడు.

ఓ, న్యాయశక్తీ! ఆనాటి మూడు తగవుల విచారణ గురించీ నువ్వు అడిగిన పూర్తి వ్యాఖ్యానం ఇదే!''అంటూముగించాడు.

విజయదత్తుడి జవాబు పూర్తి అయిన మరుక్షణం,''జోహారు యువరాజా, జోహారు! పుళింద భట్టారక మహాశయుడు కలలు గన్న మేధావివి నువ్వే! ఆ మహామంత్రవేత్త సృష్టించిన, ఈ స్వర్ణసింహాసనాన్ని అధిష్ఠించి రెండవ పౌరస్వతుడన్న బిరుదనామంతో, చక్రవర్తిగా అఖండ కీర్తిప్రతిష్ఠల నార్జించే అదృష్టం నీదే! ఇక నువ్వు నిరాటంకంగా, ఈ అపూర్వ సింహాసనం అధిరోహించవచ్చు. నీకిదే మా స్వాగతం! ''అన్నది మూడవ సాలభంజిక.

ఆ వెనువెంటనే, మూడుసాలభంజి కలూ ముక్తకంఠంతో, ''జయ, విజయదత్త యువరాజా, జయ! జయ, పౌరస్వత చక్రవర్తీ, జయ! విజయీభవ! దిగ్విజయీభవ!'' అంటూ విజయదత్తుడికి జయం పలికాయి.

ఆ జయజయధ్వానాలను అనుసరిస్తూ, సభాభవనం మొత్తం కరతాళధ్వనులతో,





జయజయధ్వానాలతో మారుమ్రోగిపోయింది. అప్పుడు విజయదత్తుడు, తన కుడిపాదాన్ని మూడవదైన ఆఖరు మెట్టు మీద మోపి పైకెక్కాడు. మరుక్షణం స్వర్ణ సింహాసనపు శిఖర భాగాన హైహయ వంశీకుల కుల దేవత అయిన గాయత్రీదేవి పాదాల దగ్గర వున్న పద్మాకారపు చెక్కడం, పద్మం విచ్చు కున్నట్టే విశాలంగా విచ్చుకున్నది. పద్మం మధ్యలో పొదగబడి వున్న పెద్ద కెంపు, నవ రత్నాలు పొదిగిన పిడితో వున్న మంత్ర పూత మైన చంద్రహాసం ఖడ్గంగా మారి, పద్మం మీద నిలిచింది. విజయ దత్తుడు, గాయత్రీ దేవి పాదాలకు మొక్కి, చంద్రహాసాన్ని తీసు కుని కళ్ళకద్దుకున్నాడు. మరుక్షణం పద్మం మళ్ళీ ఎప్పటిలా అయిపోయింది. వేదవిదు లైన పండితులు, వేదమంత్రాలతో ఆశీర్వ దించి, విజయదత్తుణ్ణి మంత్రబద్ధంగా మహారాజును చేశారు.

ఆ రాత్రి వృద్ధరాజు శ్రీదత్తుడికి, సుఖ నిద్ర పట్టింది. దాదాపు తెల్లవార వస్తూం డగా, ఏదో చప్పుడు విని ఉలికిపాటుగా ఆయన లేచాడు. ఆ సమయంలో శ్రీలేఖ వచ్చిన మరునాటి ఉదయం వచ్చిన పావు రమే గవాక్షం దగ్గర రెక్కలు టపటప లాడిస్తూ శ్రీదత్తుడి దగ్గరగా వచ్చి వాలింది.

పూర్వ పరిచయంతోదాన్ని అప్యాయంగా నిమిరిన శ్రీదత్తుడు, దాని కాలికి కట్టివున్న లేఖను తీసుకున్నాడు.

''స్వర్ణసింహాసనాధీశుడైన విజయుని కివే, మా శుభాశీస్సులు-మాధవసేనుడు, వసుమతి,'' అని వున్న ఆ లేఖ చదవగానే, శ్రీదత్తుడి ఆనందానికి మేరలేకపోయింది. వెంటనే ఆ సంగతిని కొడుక్కీ, కోడలికీ కూడా తెలియజేశాడు.

ఆ తర్వాత కొద్దిరోజుల్లోనే, అనుకున్న ప్రకారం కాళింది, చంపక, కుందదేశాల సైన్యకూటమి కౌండిన్య మీదికి దండెత్తింది. యుద్ధం ప్రారంభమవుతూనే, తమ రాజు మాధవసేనుడు రహస్యంగా ముందే ఇచ్చిన ఆజ్ఞ ప్రకారం, కాళింది సేనలు, చంపక సైని కుల్ని ఊచకోత కొయ్యటం ప్రారంభించాయి. ఇది చూడగానే, ఎవరితో యుద్ధం చెయ్యాలో పాలుపోక కుందదేశపు సైనికులు దిక్కులు చూడసాగారు.

తన ఊహ నిజమై, తన మామగారి సైన్యం కూడా, తన పక్షానే శత్రుసైన్యంతో పోరుతున్నం దుకు ఆనందిస్తూ, విజయదత్తుడు రెట్టిం చిన ఉత్సాహంతో, మంత్రబద్ధమైన తన చంద్ర

హాసాన్ని మెరుపులా ఝుళిపిస్తూ, తన పంచ కల్యాణి అశ్వాన్ని అతివేగంగా ముందుకు దూకించాడు.

చీకటి పడేవేళకు చంపక సైన్యం, దాదా పుగా నాశనమైంది. కుందదేశపు సైన్యాధిపతి, విజయదత్తుడికి లొంగిపోయాడు. చంపక ప్రభువు మరాళభూపతి, యువరాజు చక్ర భూపతి, విజయదత్తుడికిబందీలుగా చిక్కారు.

అప్పటికి, మేనల్లుడి ఎదుటపడటానికి కాస్త ధైర్యం చిక్కిన మాధవసేనుడు, విజయ దత్తుణ్ణి చూస్తూనే అతడి చేతులు పట్టు కుంటూ, ''విజయా, తిన్న ఇంటి వాసాలే లెక్క పెట్టబోయిన నన్ను మన్నించు!'' అన్నాడు.

విజయదత్తుడు, ఆ మాటకు చిరునవ్వు నవ్వి, ''పోనీలే, మామా! ఇప్పటికైనా మించి పోయిందిలేదు. నువ్వు వాసాలు లెక్కపెట్ట బోయిన ఇల్లు, నీదేనని గుర్తించు, చాలు!'' అన్నాడు.

మెత్తని కత్తిలా, మృదువుగానే తనను మందలించిన విజయదత్తుడి మాటలకు, మాధవసేనుడు నోరెత్తలేక మౌనంగా ఉండి పోయాడు.

ఆ తర్వాత, విజయదత్తుడు అంతటితో ఆగకుండా, పెద్దసైన్యాన్ని వెంటబెట్టుకుని, దక్షిణాపథ దిగ్విజయానికి బైలుదేరాడు. అప్పటికే, దక్షిణాపథంలో వున్న నాలుగు పెద్ద రాజ్యాలైన కౌండిన్య, చంపక, కాళింది, కుందదేశాలు విజయదత్తుడికి స్వాధీనమై పోయాయన్న వార్త, మిగిలిన దక్షిణాపథ మంతా వ్యాపించింది.

దానితో, చిన్నచిన్నరాజ్యాల రాజులందరూ యుద్ధమూ, జననష్టమూ లేకుండా విజయ దత్తుడికి లొంగిపోయి, సామంతరాజులుగా వుండాలని నిశ్చయించుకున్నారు.

ఆ విధంగా, రెండవ పౌరస్వత బిరు దాంకితుడైన విజయదత్తుడు, ఏనాడో తమ హైహయ వంశస్థుల చేయిజారిపోయిన దక్షిణాపథ సార్వభౌమత్వాన్ని తిరిగి దక్కించు కుని, తన బిరుదనామాన్ని సార్థకం చేసు కున్నాడు. - (ఐపోయింది)

[తండ్రిగా, గురువుగా, హితుడిగా నన్ను సర్వదా కనుపాపలా చూసుకుంటూ హఠా త్తుగా మాయమైన 'నాన్న' శ్రీ ఎం.ఎస్. ప్రకాశరావుకు ప్రేమతో నా ఈ 'స్వర్ణసింహాసనం' బహూకృతి. — మాజీ]



ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు -
తరతరాలుగా సత్యం కోసం జరిగిన అన్వేషణ!

# 10. మరణాన్ని జయించిన ప్రేమ!




''సందీపుడి పుట్టినరోజు కావడం వల్ల ఆరోజు సాయంకాలం అతడి స్నేహితులు, పదీ పన్నెండు మంది వాళ్ళింటికి చేరారు. పుట్టినరోజు హడావుడి పూర్తయ్యాక పిల్లలందరూ సందీపుడి ఇంటికి ఎదురుగుండా వున్న తోటలోని చెట్టు కిందికి చేరారు.

''తాతయ్యా! మీకు పాటలంటే ఇష్టం కదా! నా స్నేహితుల్లో ఇద్దరు బాగా పాడతారు. వాళ్ళ పాట విన్నారంటే మీరెంతో సంతోషించగలరు!'' అన్నది, శ్యామల దేవనాధుడితో.

''అలాగా!'' అంటూ తాతయ్య దేవనాధుడు శ్యామల వెంట నడిచాడు.

ఆయన వెళ్ళేసరికే పువ్వులు పూచిన ఒక పొన్నచెట్టు కింద పిల్లలు కుర్చీ వేసివుంచారు. పిల్లలందరూ తాతయ్యకు నమస్కరించారు. ఆయన కుర్చీలో కూర్చున్నాక, పిల్లలందరూ నేలమీద పరచిన తివాసీ మీద ఆయన ముందు కూర్చున్నారు.

శ్యామలతో చదువుకుంటూన్న ఇద్దరు అమ్మాయిలు, ''జయ జయ జయ జనయిత్రీ!'' అంటూ కమ్మని గీతాన్ని ఆలపించారు.

''చాలా చక్కగా పాడారు! ఇది నాకు అనుకోని బహుమతి!'' అన్నాడు దేవనాధుడు.

''మరి పాట పాడినందుకు మా బహుమతి సంగతేమిటి తాతయ్యా?'' అన్నారు పాడిన అమ్మాయిలు. ఆ మాటకు మిగిలిన పిల్లలందరూ నవ్వుతూ చప్పట్లు చరిచారు.

''ఏం కావాలో చెప్పండి. ఇప్పుడే తెప్పిస్తాను. చాక్లెట్లా? ఐస్‌క్రీములా? మరేదైనా కావాలా?'' అని అడిగాడు దేవనాధుడు.

''అవన్నీ ఇప్పుడే తిన్నాం కదా? అవేం వద్దు,'' అన్నారు పిల్లలు.

''మరేం కావాలో చెప్పండి,'' అని అడిగాడు దేవనాధుడు.

'మేము ఎరిగివున్న వాళ్ళల్లో మరెవ్వరూ ఇవ్వలేనిదీ, మీరు మాత్రమే ఇవ్వగలిగినదీ ఒకటున్నది.

విశ్వావసు



అదేమాకు కావాలి!'' అన్నారు పిల్లలు. దేవనాథుడు ''ఏమిటి?'' అన్నట్టు కనుబొమలు ఎగురవేశాడు.

''కథలు తాతయ్యా! కథలు! భారత సంస్కృతిని తెలియజేసే కథలు మాకు కావాలి,'' అన్నారు పిల్లలు.

దేవనాథుడు చిరునవ్వుతో పిల్లలందరినీ ఒకసారి పరిశీలనగా కలయజూశాడు.

''తాతయ్యా, మీరు మొన్న మార్కండేయుడి కథ చెప్పారు కదా. అప్పుడు - మరణాన్ని జయించిన మానవులలో మార్కండేయుడు ఒకడు. మృత్యులోకానికి వెళ్ళి మృత్యువును జయించి వచ్చిన మహనీయులు మరెందరో ఉన్నారు, అని చెప్పారు. మరి అలాంటి ఇతివృత్తంతోనే మరేదైనా కథలుంటే చెప్పండి తాతయ్యా!'' అని అడిగాడు సందీపుడు కుతూహలంగా.

''ఉన్నాయి; చెబుతాను,'' అంటూ దేవనాథుడు కథ చెప్పడం ప్రారంభించాడు :

అరణ్యసమీపంలోని మునివాటికలో రురుడనే ఒక మునికుమారుడు నివసిస్తూండేవాడు. రురుడు అరణ్యంలోని మునులకు శుశ్రూషలు చేస్తూ, విద్యలన్నిటినీ నేర్చాడు. శాస్త్రాలన్నిటినీ చదువుకున్నాడు. అందగాడైన రురుడు విద్యావివేక సంపన్నుడని పెద్దలందరి ప్రశంసలందుకున్నాడు.

అదే మునివాటికలో అద్భుత సౌందర్యరాశీ, సుగుణాలవెల్లీ అయిన ప్రమద్వర అనే కన్య నివసిస్తూండేది.

నవయౌవనంలో అడుగుపెట్టిన రురుడూ, ప్రమద్వరా ఒకరినొకరు చూసి, ప్రేమించుకున్నారు. పెద్దల ఆశీస్సులతో పెళ్ళిచేసుకోవాలని కూడా నిర్ణయించుకున్నారు.



తన కాబోయే భార్యకు పూలమాలను కానుకగా ఇవ్వాలనుకుని రురుడు ఒకనాటి తెల్లవారు జామున పూలసేకరణకు అడవికి బయలుదేరాడు. ప్రకృతిమాత ప్రసాదించే పుష్పాలను ఆ కాలంలో ఆభరణాలకన్నా విలువైనవిగా భావించేవారు!

ప్రమద్వర నదిలో స్నానం చేయడానికి వెళుతూ, రురుడున్న కుటీరంలోకి చూసింది. అతడు కనిపించలేదు. అడవిలోకే వెళ్ళివుంటాడని ఊహించి, ఆమె కూడా అటువైపు నడిచింది. తెల్లవారకముందు అడవిలోకి వెళ్ళకూడదనీ, క్రూరమృగాలు తిరుగాడుతూ ఉంటాయనీ ప్రమద్వర, రురుణ్ణి అంతకు పూర్వం పలుసార్లు హెచ్చరించింది. అయినా అతన్ని చూడాలన్న ఆతృతకొద్దీ ఆమె పాదాలు అడవికేసి దారితీశాయి!

రురుడు దూరంగా పూలుకోస్తూ కనిపించాడు. ఒక మర్రిఊడకు ఆనుకుని ఒయ్యారంగా నిల



బడి తనకోసం ఎదురుచూస్తూన్న ప్రమద్వరను చూడగానే రురుడికి చెప్పలేనంత ఆనందం కలిగింది.

తనను చూశాక కూడా రాలేదు కదా అని ప్రమద్వరకు ప్రియుడిమీద చిరుకోపం పుట్టు కొచ్చింది. తను వెళ్ళి పువ్వులు అందివ్వగానే ప్రియురాలి కోపమంతా మటుమాయమై పోగల దని రురుడు లోలోపల నవ్వుకున్నాడు! అయినా అలాంటిదేదీ జరగడానికి అవకాశం లేకుండా పోయింది!

ప్రమద్వర నేలపై దేన్నో గజగజ వణుకుతూ చూసి భయంతో కేకపెట్టి కిందపడి పోయింది. రురుడు ఒక్క గెంతున అక్కడికి చేరాడు. త్రాచు పాము ఒకటి మెరుపులా పొదలచాటుకు మాయమై పోయింది. అది భయంకరమైన విషనాగు. అలాంటి పాముకాటుకు గురైనవాళ్ళు బతకడం కల్ల. రురుడు భయం భయంగా ఆమెను సమీపించి, ఆమెను ఒడిలోకి తీసుకుని మాట్లాడించడానికి ప్రయత్నించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. ఆమె అతడికేసి దిగ్భ్రాంతితో చూస్తూ, తనను ఎలాగైనా కాపాడలేవా అని అర్థిస్తున్నట్టు దీనంగా కళ్ళుమూసింది!

రురుడికి ఒక్కక్షణం కాలం స్తంభించినట్టయింది. ఏమి చేయడానికీ తోచలేదు. మెల్లమెల్లగా తేరు కుని, తన ప్రేయసిని ఎలాగైనా మళ్ళీ బతికించు కోవాలన్న దృఢనిశ్చయానికి వచ్చాడు. ఆ రోజంతా అటూ ఇటూ కదలకుండా అక్కడే స్థాణువులా కూర్చుని - తనకు చేయతగిన సాయం చేయ మని దేవతలందరినీ ప్రార్థించాడు.

అర్ధరాత్రి సమయంలో దివ్యతేజస్సుతో మన్మ థుడు అతని ఎదుట ప్రత్యక్షమయ్యాడు. హఠా త్తుగా సంభవించిన ప్రేయసి ఎడబాటుతో ప్రియుడు అనుభవించే విరహవేదన మన్మథుడికే తెలుసు. మృత్యులోకంలో ప్రవేశించి, ప్రమద్వర ఆత్మను చూడగల రహస్యాన్ని మన్మథుడు, రురుడికి తెలియజేశాడు!

రురుడు మృత్యులోకంలో ప్రవేశించి అక్కడి ప్రమద్వర ఆత్మను గుర్తించాడు. కాని మృత్యు లోక భటులు అతన్ని, ఆమెతో మాట్లాడనివ్వ లేదు. రురుడికీ, యమభటులకూ మధ్య సుదీర్ఘ మైన సంభాషణలు జరిగాయి. ఆఖరికి యమ ధర్మరాజు సైతం - ప్రమద్వర పట్ల రురుడికి వున్న ఉన్నతమైన ప్రేమను గుర్తించి ముగ్ధుడై ప్రమ ద్వరకు మళ్ళీ ప్రాణం ప్రసాదించడానికి అంగీక రించాడు. అందుకు ఒక నిబంధన విధించాడు. ప్రమద్వర ఆయువు తీరిపోవడం వల్ల, రురుడు తన ఆయువులో సగం ధారపోస్తేనే ఆమె పునర్జీ వితురాలవుతుంది. రురుడు అమితానందంతో ఇప్పటికి మిగిలివున్న తన ఆయువులో సగం ప్రమద్వరకు ధారపోశాడు.

మరుక్షణమే ప్రమద్వర నిద్రనుంచి మేల్కొన్నట్టు లేచికూర్చున్నది. ఇరువురూ పెళ్ళిచేసుకుని ఆదర్శవంతమైన జీవితం గడిపారు! అమర ప్రేమికులుగా నిలిచిపోయారు!

''ఈ కథలోని అంతరార్థం మీకు అర్థమయిందా?'' అని అడిగాడు దేవనాథుడు కథ చెప్పడం పూర్తిచేశాక.

''కథ అద్భుతం! కాని అంతరార్థం మాత్రం ....'' అంటూ ఆగారు పిల్లలు.

''జననమరణాలు పరస్పర విరుద్ధమైనవని మనం సాధారణంగా అనుకుంటాం. నిజానికి మరణం అంటే - ఒక నిర్దిష్ట జీవన రూపం కనుమరుగు కావడం మాత్రమే. మరణానికి వ్యతిరేకమైనది ప్రేమ మాత్రమే. ఒక వ్యక్తి మరణించినప్పుడు - ఆ వ్యక్తిపట్ల మనకున్న ప్రేమను బట్టే మన విషాదం, శోకం ఉంటాయి. ఎప్పటికైనా సరే ఒక్క ప్రేమకు మాత్రమే మరణాన్ని జయించే శక్తి ఉన్నదని ఈ కథ మనకు సూచిస్తుంది. ఆ ప్రేమ చాలా విలక్షణమైనది. విభిన్నమైనది. మరణంలేనిది ప్రేమ. త్యాగమే దాని ప్రాణం! మన పురాణాలలోని మరొక కథ కూడా ఈ విషయాన్ని సూచిస్తున్నది. ఆ కథ ఏమిటో మీరెవరైనా చెప్పగలరా?'' అని ఆగాడు దేవనాథుడు.

''సావిత్రి - సత్యవంతుల కథనే కదా తమరు అడిగింది?'' అన్నాడు ఒక కుర్రవాడు.

''అవును. మహాభారతంలో చదివావా?'' అని అడిగాడు దేవనాథుడు.

''కాదు తాతయ్యా, మాఅమ్మ చెప్పింది. శ్రీ అరవిందులు రచించిన 'సావిత్రి' మహా కావ్యాన్ని మా అమ్మ రోజూ చదువుతుంది!'' అన్నాడా కుర్రవాడు.

''అలాగా! చాలా సంతోషం. మహాయోగీ - మహాకవీ అయిన శ్రీ అరవిందులు అద్భుతమైన ఆ కావ్యంలో ప్రగాఢ సత్యాలెన్నిటినో తెలియజేశాడు. మీకందరికీ సావిత్రి కథ తెలుసనుకుంటాను. దానిని మళ్ళీ చెప్పనవసరం లేదు కదా?'' అన్నాడు దేవనాథుడు.

కొంతసేపు మౌనం తరవాత అందరూ ఒక్కసారిగా, ''కాదు, తాతయ్యా. మాలో చాలా మందికి ఆ కథ తెలియదు. పైగా ఆ కావ్యం గురించి కూడా తెలియదు,'' అన్నారు.

''సరే! అలాగే చెబుతాను. అయితే ఇప్పుడు కాదు. మరొక రోజు. ఇక మీరు వెళ్ళి మీ చదువుల సంగతి చూడండి,'' అంటూ దేవనాథుడు లేచాడు.

- (ఇంకావుంది)





# అంగరక్షకుడు

పూర్వం శిఖ్యంగేరి దేశాన్ని పరిపాలిస్తున్న వీరభద్రరాజుకు, ఒక అంగరక్షకుణ్ణి నియమించవలసి వచ్చింది. ఆ పదవికి యుద్ధ విద్యల్లో ఆరితేరిన చాలామంది యువకులు వచ్చారు. వాళ్ళందరినీ పరీక్షించి, అర్హుడైనవాణ్ణి అంగరక్షకుడిగా ఎంపికచేసే బాధ్యత రాజు, మంత్రికి అప్పగించాడు.

మంత్రి ఆ యువకులందరికీ అనేక పరీక్షలు పెట్టి, చివరకు గజసేనుడు, ఉగ్రసేనుడు అనేవాళ్ళు అంగరక్షక పదవికి తగిన వాళ్ళని నిర్ణయించాడు. ఐతే, రాజుకు కావలసిన అంగరక్షకుడు ఒక్కడేకావడంతో, ఏంచేయాలో మంత్రికి తోచలేదు.

ఈ పరిస్థితుల్లో మంత్రి బాగా ఆలోచించి, వాళ్ళిద్దరిని గురించీ రాజుకు చెప్పి, "ప్రభూ, ఈ గజసేనుడు, ఉగ్రసేనుడు అన్నిటా సరి సమానులు. ధైర్యసాహసాల్లోగాని, తెలివి తేటల్లోగాని ఇద్దరి మధ్యా రవ్వంత తేడా కూడా నాకు కనిపించడం లేదు. కనుక, ఈ ఇద్దరిలో ఎవరు అంగరక్షకుడి పదవికి మరింత అర్హులో, తమరే నిర్ణయించడం మేలని నేను అభిప్రాయపడుతున్నాను," అన్నాడు.

రాజు కొంచెంసేపు ఆలోచించి, "సరే, ఆ అంగరక్షకుడి నియామకమేదో నేనే చూస్తాను. అంగరక్షకుడి పదవి ఆశించి వచ్చిన మిగిలిన యువకుల మాటేమిటి?" అని అడిగాడు.

"వాళ్ళందరూ మెరికల్లాంటి వాళ్ళు. అందరూ సైనికపదవికి తగినవాళ్ళే. నేనాలోచిస్తున్నదేమంటే - ఆ యువకుల్లో కొందరిని దళనాయకులుగా, మరికొందర్ని కొంత శిక్షణ తర్వాత చారులుగా నియమించడం బావుంటుందని," అన్నాడు మంత్రి.

"మీ ఇష్టప్రకారమే చేయండి. నేను రేపే బయలుదేరి కొండకోన సమీపానవున్న ఉద్యాన వనానికి పోతున్నాను. మీరనే ఆ గజసేనుడూ, ఉగ్రసేనుడూ అనే వాళ్ళలో ఒకణ్ణి, నా వెంట అంగరక్షకుడుగా పంపండి!" అన్నాడు రాజు.

కోలార్ కృష్ణ అయ్యర్

మర్నాడు సూర్యోదయంతోనే రాజూ, మంత్రి పంపిన గజసేనుడూ గుర్రాల మీద ఉద్యానవనానికి బయలుదేరాడు. గజసేనుడు ఒరలో కత్తీ, భుజాన విల్లంబులూ, చేత పొడవాటి ఈటే పట్టుకుని, రాజు వెనకగా గుర్రాన్ని నడపసాగాడు.

మిట్టమధ్యాహ్నం వేళకు ఇద్దరూ ఉద్యానవనాన్ని చేరారు. రాజు అక్కడి కుటీరం లోపలికివెళ్ళి విశ్రాంతి తీసుకుంటూండగా, కొందరు గ్రామస్థులు పరుగుపరుగున అక్కడికి వచ్చి, "మహాప్రభో! గత రెండు రాత్రులుగా, దాపులనున్న అరణ్యం నుంచి పులి ఒకటి వచ్చి, గ్రామంలో కనబడిన మేకలనూ, గొర్రెలనూ ఇతర పశువులనూ చంపి తింటున్నది. ఈ రోజు పట్టపగలే గ్రామంలో జొరబడి నానా బీభత్సం చేస్తున్నది. అందరూ తలుపులు బిగించుకుని బిక్కుబిక్కుమంటూ ఇళ్ళల్లో వుండిపోయారు. మేం కొద్దిమందిమి సాహసించి ఇక్కడికి పారిపోయి వచ్చాం. ఆ పులినుంచి తమరే మా గ్రామస్థుల్ని కాపాడాలి!" అన్నారు.

వెంటనే రాజు, "గజసేనా! గ్రామస్థుల వెంట వెళ్ళి, ఆ పులిని చంపిరా," అన్నాడు.

"ప్రభూ! అలాగే చేస్తాను. ఈ స్వల్ప కార్యానికి కత్తీ, విల్లంబుల అవసరం లేదు, ఈ ఈటె ఒక్కటి చాలు. ఆ పులిని క్షణాల మీద చంపి, తిరిగివస్తాను," అంటూ గజసేనుడు గ్రామస్థుల వెంట బయల్దేరాడు.

ఆ తర్వాత, ఒక గంట కాలం గడిచీ గడవకముందే, వాడు, రాజు దగ్గరకు తిరిగి వచ్చి, "ప్రభూ! ఆ పులి ఎంత వెతికినా గ్రామంలో కనిపించలేదు. మళ్ళీ అరణ్యానికి



పారిపోయివుంటుంది," అన్నాడు. దానికి రాజు తలాడించి, సూర్యాస్తమయం వేళకు రాజధాని చేరాడు.

ఒక వారం గడిచాక, రాజు అదే ఉద్యానవనానికి పోతూ, ఈసారి ఉగ్రసేనుణ్ణి తన వెంట అంగరక్షకుడిగా తీసుకువెళ్ళాడు. ముందులాగే ఈసారి కూడా, కొందరు గ్రామస్థులు ఆయన దగ్గరకు వచ్చి తమ గ్రామంలో పులి ఒకటి ప్రవేశించి, జంతువులను చంపుతూ, కంటబడిన మనుషుల మీదికి కూడా దూకుతున్నదనీ, దాని బారి నుంచి రక్షించమనీ వేడుకున్నారు.

రాజు అక్కడేవున్న ఉగ్రసేనుడితో, గ్రామస్థుల వెంట వెళ్ళి పులిని చంపి రమ్మన్నాడు. ఐతే, ఉగ్రసేనుడు కదలక మెదలక గ్రామస్థులకేసి చూస్తూ వుండిపోయాడు.

రాజు కోపంగా, ''ఇది నా ఆజ్ఞ! కదలవేం?'' అన్నాడు.

అందుకు ఉగ్రసేనుడు ఎంతో విన యంగా, ''ప్రభూ! నన్ను మన్నించండి. ఇక్కడ తమరిని ఒంటరిగా వదిలిపెట్టి నేను మరె క్కడికీ వెళ్ళలేను. గ్రామస్థుల్ని రాజధానికి పోయి, పులిని చంపేందుకు ఎవరినైనా పంప మని సేనాధిపతిని కోరమనండి. నేను తమ అంగరక్షకుణ్ణి!'' అన్నాడు.

''ఇంతమంది ఎదుట, నా ఆజ్ఞనే ధిక్క రిస్తున్నావా! ఈ ధిక్కారానికి శిక్ష ఏమిటో తెలుసా - మరణశిక్ష!'' అన్నాడు రాజు కోపంగా.

''మీ ఆజ్ఞాపాలన చేయనందుకు క్షమిం చండి. నేను కేవలం తమ అంగరక్షకుణ్ణి మాత్రమే,'' అన్నాడు ఉగ్రసేనుడు.

రాజు, ఉగ్రసేనుడితో మరేం మాట్లాడ కుండా, గ్రామస్థులతో తను రాజధానికి చేరాక, భటులను పంపి, పులిని చంపి స్తానని చెప్పి, అప్పటికప్పుడు రాజధానికి తిరిగివచ్చాడు.

ఆ రాత్రి ఆయన మంత్రికి కబురుచేసి, అతడు రాగానే, ఉద్యానవనంలో జరిగిన దంతా చెప్పి, ''గజసేనుడికి మన రక్షకభటుల్లో, మీకు ఉచితమని తోచిన పదవి ఇవ్వండి. నాకు అంగరక్షకుడుగా ఉగ్రసేనుణ్ణి నియ మించండి,'' అన్నాడు.

రాజు నిర్ణయానికి మంత్రి ఆశ్చర్యపోయి, ''ప్రభూ! ఉగ్రసేనుడు పది మంది ఎదుట మీ ఆజ్ఞను ధిక్కరించిన వాడు గదా?'' అన్నాడు.

ఆ ప్రశ్నకు రాజు చిరునవ్వు నవ్వి, ''ఆ ధిక్క రించడం కూడా, వాడు మరణశిక్షకు సిద్ధపడి మరీ ధిక్కరించాడు. అందుకే వాణ్ణి, నాకు అంగరక్షకుడుగా నియమించమంటున్నాను. అంగరక్షకుడి బాధ్యత, తను అన్నివేళలా తన ప్రభువు వెంటవుంటూ, అతడికి ఇతరుల నుంచి ఎలాంటి హానీ కలగకుండా చూడడం. అంతేగదా?'' అన్నాడు.

''అవును, ప్రభూ!'' అన్నాడు మంత్రి.

''ఇంత ప్రధానవిషయం, గజసేనుడి గ్రహింపుకు రాలేదు. వాడు ధైర్యశాలేగాని, బుద్ధిశాలిమాత్రం కాదు,'' అన్నాడు రాజు.

ఈ విధంగా, ఉగ్రసేనుడు, వీరభద్ర రాజుకు అంగరక్షకుడై, ఆయన ఆదరాభి మానాలకు పాత్రుడయ్యాడు.



ఇదొక చందమామ కానుక!

# పరోపకారి చిన్నడు

## రాక్షసుడి బెడద

చిత్రాలు : పాణి






ఒక మనిషి, ఒక గాడిదనూ, ఒక మేకనూ తోలుకొని వచ్చాడు. గాడిద వీపున అన్నపు సంచులూ, కాల్చిన కోళ్ళూ ఉన్నాయి. మేకను కూడా తాడుతో గాడిదకు కట్టి ఆ మనిషి రెంటినీ గుహవరకు లాక్కుపోయి వదిలాడు.

ఏం జరుగుతున్నదో తెలుసుకోవాలని చిన్నడు ఆ మనిషి దగ్గరికి వెళ్ళాడు

''గుహలో ఎవరు ఉంటున్నారు? అంత ఆహారాన్ని లోపలికి పంపి నువ్వు మాత్రం బయటే ఉండిపోయావేం?''

''అంతా మామూలు కథే! మా గ్రామానికి పట్టిన పీడ ఎప్పుడు విరగడవుతుందో, ఏమో!''

''మీ గ్రామానికి పట్టిన పీడ ఏమిటో చెప్పు, నేను వదలగొడతాను!''

''అది అంత సులభంకాదు బాబూ! మా ఊరి భూతాల వైద్యుడు పోతయ్యనే కబళించిన రాక్షసుణ్ణి నువ్వేం చేయ గలవు? పూర్వం ఎప్పుడో ఒక రాక్షసుడు ఈ కొండగుహలో ఉండి ఊరిజనాన్ని విరుచుకు తిన్నాడట!



వాడికి భయపడి ఊరు పాడుబెట్టి జనం ఎటో వెళ్ళారు. ఒకసంవత్సరం తరవాత నెమ్మదిగా తిరిగివచ్చి, అదే ఊళ్ళో మామూలుగా జీవించసాగారు. ఆరు నెలల కిందట మళ్ళీ గ్రామంలో కోళ్ళు, గొర్రెలూ, మేకలూ మాయం కాసాగాయి. భూతాలవైద్యుడు పోతయ్య శిష్యులకు కొండమీద తాటి చెట్టు ప్రమాణాన ఒక రాక్షసుడు కనిపించాడట! పోతయ్య ఒంటరిగా గుహలోనికి వెళ్ళి, రాక్షసుడితో మాట్లాడి, గ్రామస్థులు వంతుల ప్రకారం వాడికి మేకతోసహా ఆహారం పంపేట్టూ, వాడు గ్రామం ఛాయలకు రాకుండా ఉండేట్టూ ఏర్పాటు చేసుకొని వచ్చాడు.










''ఒకనాడు పోతయ్య కుటుంబమూ, అతని శిష్యుల కుటుంబాలూ జాతరకని దూరగ్రామానికి వెళ్ళారు. కాని తిరిగి రాలేదు. కొండ పక్కగా వెళ్ళిన వాళ్ళను, రాక్షసుడే పట్టి తినేసి ఉంటాడని అనుమానం కలిగింది. పోతయ్య మండిపోయాడు.
''మహా మహా పిశాచాలను గడగడలాడించే నాకే రాక్షసుడు ఇంత ద్రోహం చేస్తాడా? సహించను!''


పోతయ్య తన అనుచరులు నలుగురిని వెంటబెట్టుకుని ఆవేశంగా గుహలోకి వెళ్ళాడు. కాని ఒక్కరూ తిరిగిరాలేదు.


వాళ్ళను కూడా రాక్షసుడే పొట్టనపెట్టుకుని ఉండాలి. అప్పటి నుంచి రోజూ రాక్షసుడికి ఆహారం పంపుతూ దేవుడి మీద భారం వేసి కాలం గడుపుతున్నాము.


ఒక్కదెబ్బతో నాలుగు కుటుంబాలను తినేసిన రాక్షసుడు, ఆ తరవాత కోళ్ళతో మేకలతో సరిపెట్టుకుని బుద్ధిగా ఉండడం చిన్నడికి నమ్మశక్యం కాలేదు. ఇదంతా పోతయ్యా, అతని అనుచరులూ గుహలోకి చేరి రాక్షసుడి పేరుమీద ఆడుతున్న నాటకం అయివుంటుందని చిన్నడు ఊహించాడు.
''పోతయ్యనూ, అతని మనుషులనూ తినేసినాక, రాక్షసుణ్ణి ఎవరైనా చూశారా?''
''లేదు. పోతయ్య పుణ్యమా అని రాక్షసుడు ఇప్పుడు పాత ఏర్పాటును చక్కగా పాటిస్తున్నాడు.''
చిన్నడు తన కర్తవ్యం నిర్ణయించుకుని గ్రామం చేరాడు.


ఆ రాత్రి చిన్నడు కటిక చీకట్లో కొండను చేరి గుహ బయట జాగ్రత్తగా ఆలకిస్తూ కూర్చున్నాడు. లోపల ఎవరో మాట్లాడుకోవడం వినిపించింది.


వాడు పిల్లిలా లోపలికి తొంగి చూశాడు. గుడ్డి దీపం వెలుగులో కొందరు మాంసం పీక్కుతినడం అస్పష్టంగా కనిపించింది. రాక్షసుడి జాడలేదు. చిన్నడు మరో కంటికి తెలియకుండా ఊరు చేరాడు.


మరుసటి రోజు ఉదయం ...
"నిన్న రాత్రి గుహలో కొందరు రాక్షసులను చూశాను. కాని వారు భయంకరులు కారు.వాళ్ళ ఆట కట్టించాలి. అందుకు ఒక ఉపాయం ఆలోచించాను."
"అలాగే చేద్దాం!"


అందరూ కలిసి గుహవద్దకు వెళ్ళి, గుహద్వారానికి కాస్త పచ్చిగా వున్న కట్టెలు పేర్చి నిప్పంటించారు.


కమ్ముకొస్తున్న పొగకు తట్టుకోలేక, గుహలోపల నుంచి పోతయ్యా, అతని అనుచరులూ కాలే కట్టెలను తోసుకుంటూ బయటకు వచ్చారు. వాళ్ళను చూసి గ్రామస్థులు ఆశ్చర్యపడ్డారు. ఇక ఆ ఊళ్ళో ఉండడానికి మొహం చెల్లక పోతయ్య పరివారంతో ఎటో వెళ్ళిపోయాడు.


కృతజ్ఞతలు, బాబూ! అసలు రాక్షసుడి బెడద వదిలించావు!


భైరవా! ఇప్పుడు మనం ఎక్కడికి వెళదాం?
చిన్నడు ఊరి వాళ్ళ దగ్గర సెలవు పుచ్చుకుని, తన కుక్కతో సహా మరో గ్రామానికి బయలుదేరాడు.
వచ్చేనెల : మరొక కొత్త సాహసగాథ



# చావురానివాడు

ఒకానొకప్పుడు అవంతీనగరంలో రామ నాధుడనే వ్యాపారివుండేవాడు. అతడికి మంచి నిజాయితీపరుడన్న పేరు వుండేది. హఠాత్తుగా అతడు కాలం చేయడంతో, అంతవరకు చదువుకుంటూవున్న అతడి కొడుకైన మనోహరుడు, తండ్రి వ్యాపారం చూసుకోవలసివచ్చింది.

రామనాధుడి మరణానంతరం, అతడు చేసిన అప్పులు, ఆస్తులు లెక్కకడితే, అప్పులు ఎక్కువని తేలింది. మనోహరుడు చిన్న వాడైనా ధైర్యం కూడగట్టుకుని కొన్ని అప్పులు తీర్చి తండ్రిచేసిన వ్యాపారం కొనసాగించాడు . అయితే, అదృష్టం కలిసి రాక ఇచ్చిన బాకీలు వసూలుకాక, కొత్త అప్పులు పెరిగి వ్యాపారం బాగా దెబ్బతిన్నది.

అప్పులవాళ్ళు మనోహరుణ్ణి బాకీలు తీర్చమని ఒత్తిడి చేశారు. మనోహరుడు తన దురదృష్టానికి చింతించాడు. అతడికి ఆత్మ హత్య తప్ప వేరే దారి కనిపించలేదు. అడవికి పోయి ఏ పులికో, తోడేలుకో ఆహారమై పోదామనుకుంటూ, అతడు నగరం వదిలి అడవి చేరాడు.

అక్కడ మనోహరుడు, ఒక చిన్న కాలి బాట వెంట నడుస్తూండగా దూరం నుంచి పులిగాండ్రింపు వినిపించింది. అది వింటూనే అతడు ఒక క్షణకాలం భయకంపితుడై పోయాడు కాని, అంతలోనే గుండె దిటవు చేసుకొని, ఆ అరుపు వచ్చిన దిశకేసి తిన్నగా నడవసాగాడు.

ఒకటి రెండు క్షణాలు గడిచేంతలో, ఈసారి పులి మరింత పెద్దగా గాండ్రిస్తూ, చెట్లచాటునుంచి కుప్పించి దూకుతూ మనోహరుడికేసి రాసాగింది. దాన్ని చూస్తూనే అతడు కొయ్యబారిపోయి కళ్ళు మూసు

ఎన్. శివనాగేశ్వర రావు



కుని వున్నచోటునే స్థాణువులా నిలబడి పోయాడు. అంతలో పులి దభీమంటూ నేల మీద పడిపోయిన శబ్దం వినవచ్చింది.

మనోహరుడు ఆశ్చర్యపోతూ కళ్ళు తెరిచాడు. పులి నేలమీద గిలగిలా కొట్టు కుంటున్నది. దాని గుండెల్లో దిగిన బాణం నుంచి నెత్తురు బయటపడుతున్నది. అతడు మరింతగా ఆశ్చర్యపోతూ, చుట్టూ కలయ చూసేంతలో, కోయ యువకుడొకడు అక్కడికి పరిగెత్తివస్తూ, ''అదృష్టవంతుడివి! ఇది మనిషి రక్తం రుచి ఎరిగిన పులి. పొద్దుటినుంచీ దీన్ని హతమార్చేందుకు కాపువేసివున్నాను,'' అన్నాడు.

మనోహరుడు విరక్తిగా, ''నేను అదృష్ట వంతుణ్ణికాదు; దురదృష్టవంతుణ్ణి! నేను జీవించడం ఇష్టంలేక ఈ రోజు ఏ పులికో, తోడేలుకో ఆహారమైపోదామని ఈ అడవికి వచ్చాను,'' అన్నాడు.

కోయయువకుడు కనుబొమ్మలు చిట్లించి మనోహరుడికేసి వింతపడుతున్నట్టు చూస్తూ, ''అంటే నువ్వు చావుకోరి మరీ అడవికి వచ్చా వన్నమాట! కావాలంటే, ఒక్క బాణం దెబ్బతో నీ కోర్కె తీర్చగలను కాని, అప్పుడు నన్ను హత్యానేరం కింద రాజభటులు పట్టుకు పోతారు. పోయి, ఆ కనబడే కొండ శిఖరం ఎక్కి దిగువనున్న లోయలోకి దూకు, ఏ ఆటంకమూ లేకుండా నీ కోర్కె నెరవేరు తుంది,'' అంటూ, కొన ఊపిరితోవున్న పులి దగ్గరకు వెళ్ళాడు.

ఆ క్షణంలో మనోహరుడికి, కోయ యువ కుడు తగిన సలహా యిచ్చాడనిపించింది. అతడు వేగంగా కొండకేసి నడిచి, శిఖరంకేసి ఎక్కడం ప్రారంభించాడు. ఐతే, శిఖరం ఇంకా నూరు, నూటఇరవై అడుగుల దూరం వున్నదనగా, హఠాత్తుగా రెండు కొండ గొర్రెలు ఒకదాన్నొకటి ఢీకొడుతూ రాళ్ళచాటునుంచి బయటికొచ్చినై.

మనోహరుడు, వాటికేసి చూస్తూ నిల బడిపోయాడు. అంతలో గొర్రెలగిట్టల తాకిడికి, ఒక బండరాయి కదిలి దొర్లు కుంటూ అతడికేసి వచ్చింది. అది చూసి మనోహరుడు భయంతో పక్కకు తప్పు కున్నాడు. ఈలోపల బండరాయి అతడి కుడికాలి పాదం మీదుగా దొర్లిపోయింది. పాదం నలిగి అతడికి విపరీతమైన బాధ కలిగింది.

ఆ బాధతో మనోహరుడు కొండ ఎక్క లేకపోయాడు. బండరాయి దొర్లివస్తుంటే,

దానికింద పడిచావకుండా భయంతో పక్కకు తప్పుకున్నందుకు, తనను తాను నిందించుకున్నాడు. మరొకసారి చావు తప్పిపోయినందుకు బాధపడ్డాడు.

వ్యాపారంలోనే కాక, చావు విషయంలోనూ దురదృష్టం తనను వెంటాడుతున్నందుకు మనోహరుడు కళ్ళనీళ్ళ పర్యంతమైపోయాడు.

ఐనా, చావు విషయంలో మనోహరుడి పట్టుదల సడలలేదు. ఈసారి చావుకోసం ఏం చేయాలా అని అతడు ఆలోచిస్తూ కొండ దిగుతూండగా, అతడికి దారిపక్కన ఒక పెద్దపుట్ట కనిపించింది. వెంటనే వెళ్ళి పుట్టలో చేయి పెట్టాడు. అందులో వున్న ఏదో ఒకపాము తనను కాటు వేస్తుందని అతడి ఆలోచన.

కాని, అక్కడా మనోహరుణ్ణి చావు వరించలేదు. ఆ సమయంలో పుట్టలో పాము లేదు. అతడు పుట్టను అటూయిటూ తడిమి చూశాడు. అతడి చేతికి ఒక ఉంగరం దొరికింది.

ఈసారి కూడా చావురానందుకు విచారపడుతూ, దొరికిన ఉంగరాన్ని ఏంచేయాలో తోచక చేతివేలికి పెట్టుకున్నాడు. ఆ తర్వాత, చావడానికి దారేమిటా అని ఆలోచిస్తూ, మనోహరుడు కొండదిగి నడవసాగాడు.

దారిలో అతడికి ఇద్దరు రాజభటులు ఎదురయ్యారు. వాళ్ళు అతడి వేలికున్న ఉంగరాన్ని చూసి, అటూఇటూ తిప్పి పరీక్షించి, ''ఇది నీదగ్గరకు ఎలావచ్చింది?'' అని గద్దించి అడిగారు.

ఉంగరం తనకు పాము పుట్టలో దొరికిన విషయం వివరించాడు మనోహరుడు. అయినా రాజభటులు దానిని కట్టు కథగా భావించారు.

నిజానికి ఆ ఉంగరం రాజముద్రిక. అవంతీరాజైన కీర్తిచంద్రుడి అంతఃపురంలో దొంగతనం జరిగింది. విలువైన నగలతో పాటు, రాజముద్రిక కూడా దొంగిలించ





బడింది. అంతఃపురంలో దొంగతనం జరిగిందని తెలిస్తే, ప్రజలు తనను తేలికగా భావిస్తారని, మహారాజు ఆ విషయం బయటకు పొక్కనీయలేదు, దొంగను పట్టుకునే ఏర్పాట్లు మాత్రం చేశాడు.

అంతఃపురంలో దొంగతనం చేసిన గజదొంగ, రాజముద్రికను గుర్తించి, అది తన దగ్గర వుండడం ప్రమాదమని గ్రహించి, సమయానికి కనిపించిన పుట్టలో, ఆ రాజముద్రిక వేసి, మిగిలిన నగలతో పారిపోయాడు.

ఆ రాజముద్రికే మనోహరుడికి పాము పుట్టలో దొరికింది. మనోహరుడు నిజం చెప్పినా నమ్మని రాజభటులు, అతణ్ణి మహారాజు ముందు నిలబెట్టారు. కీర్తిచంద్రుడు, మనోహరుడి వంక ఒక క్షణం ఉరిమి చూసి నిజం చెప్పమని గద్దించి అడిగాడు.

అప్పుడు, మనోహరుడు, ''మహారాజా! నేను ప్రపంచంలో అందరికంటే గొప్ప దురదృష్టవంతుణ్ణి. వ్యాపారం చేసే నా తండ్రి చనిపోయి అప్పులు మిగిలాయి. అవి తీర్చడానికి వ్యాపారం చేస్తే నష్టం ఎదురైంది. చావడానికి అడవికిపోతే, అక్కడ నన్ను చంపవచ్చిన పులిని మరొకడు చంపేశాడు. కొండ మీదనుంచి దూకి చావాలనుకుంటే, కొండరాయి ఒకటి దొర్లుకుంటూ వచ్చి కాలుకు దెబ్బ తగిలింది. పాము చేత కరిపించుకోవాలని పుట్టలో చేయి పెడితే, పాము కరవలేదు గాని, ఈ ఉంగరం దొరికింది. అదే నన్ను మీ ముందు దొంగగా నిలబెట్టింది!'' అని చెప్పాడు.

''నువ్వు చావు కోసం ఇంతగా ప్రయత్నించినా, చావకపోవడం చాలా విడ్డూరంగా వుంది,'' అన్నాడు మహారాజు అమిత ఆశ్చర్యంతో.

''నేను చెప్పింది నిజం, మహారాజా! అసలు నాకు చావురాదేమోనని భయంగానూ, దిగులుగానూ వుంది. ఎన్ని ప్రయత్నాలు చేసినా చావురావడంలేదు. కావాలంటే మీరే స్వయంగా చూడండి!'' అని, మనోహరుడు అంతఃపురం పైనుంచి కిందికి దూకేశాడు.

మనోహరుడు అలా దూకడం చూసిన మహారాజు, ఈసారి మనోహరుడు తప్పక మరణించివుంటాడని భావించి బాధపడుతూ, గవాక్షం నుంచి కిందికి చూశాడు.

మనోహరుడు పైనుంచి కిందికి దూకినప్పుడు, కింద గుర్రం మీద వస్తున్న ఒక సైనికుడి మీద పడ్డాడు. దానితో గుర్రం

మీదనుంచి ఇద్దరూ కిందపడ్డారు. మనోహరుడికేం దెబ్బలు తగలలేదుగాని, సైనికుడికి మాత్రం నడుం విరిగింది. వాడు స్పృహ తప్పిపోయాడు.

మనోహరుడు ఒంటికి అంటిన మంటిని దులుపుకుంటూలేచి, అంతఃపురగవాక్షం నుంచి చూస్తూన్న మహారాజుతో, ''మహారాజా! ఇప్పటికైనా నమ్ముతారా, నాకు చావు రావడంలేదని?'' అని పెద్దగా అరిచాడు.

నడుం విరిగిన సైనికుడికి వైద్యులు చికిత్స చేస్తూండగా, వాడి దుస్తులనుంచి ఒక లేఖ బయటపడింది. ఆ లేఖ పొరుగురాజ్యం రాజు విక్రమసింహుడికి రాయబడింది. అందులో కీర్తిచంద్రుడి సైనిక బలానికి సంబంధించిన అన్ని వివరాలూ రాయబడి వున్నాయి.

ఆ లేఖ చదివిన కీర్తిచంద్రుడు, అన్ని సైనిక రహస్యాలు సేకరించిన సైనికుడు, తప్పక విక్రమసింహుడి గూఢచారి అయి వుంటాడని నిర్ధారించుకున్నాడు. స్పృహ వచ్చాక సైనికుణ్ణి ప్రశ్నిస్తే, వాడు తను పొరుగురాజు విక్రమసింహుడి గూఢచారినని ఒప్పుకున్నాడు.

ఆ గూఢచారి సేకరించిన వివరాలు శత్రురాజుకు అందితే, యుద్ధం జరగడమే కాకుండా, తను ఓటమి పాలయివుండే వాడినని కీర్తిచంద్రుడు అర్థం చేసుకున్నాడు. అతడు గూఢచారి సైనికుణ్ణి చెరసాలకు పంపి, రాజ్యానికి యుద్ధప్రమాదం తప్పించిన మనోహరుడికి లక్షవరహాలు బహుమతిగా యిస్తూ, ''లక్షణంగా ఈ డబ్బుతో వ్యాపారం ప్రారంభించు. ఇకనుంచి నిన్ను దురదృష్ట దేవత వెన్నాడడం మానేసి, అదృష్టదేవత వెన్నుకాచివుంటుంది!'' అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

రాజుయిచ్చిన ధనంతో మనోహరుడు, తండ్రి చేసిన అప్పులు తీర్చివేయడమేగాక, మరొకసారి వ్యాపారం ప్రారంభించి నిజాయితీగల వ్యాపారిగా పేరూ, ధనం రెండూ గడించాడు.





# పెళ్ళి పరీక్ష

రామాపురం జమీందారు దివాణంలో, రమణయ్య కోశాధికారిగా వుండేవాడు. ఆయన ఏకైక సంతానం సునంద. తల్లిలేని పిల్ల కావడంచేత ఆమెను ఎంతో గారాబంగా పెంచాడు. సునందకు యుక్త వయస్సు రాగానే తగిన వరుడికోసం, రమణయ్య ప్రయత్నాలు ప్రారంభించాడు. దివాణం లోనే ఒక మంచి యువకుణ్ణి చూసి పెళ్ళి చేస్తే, కూతురు కలకాలం తనకు దగ్గరగా వుంటుందని, రమణయ్య ఆలోచన.

దివాణంలో తన దగ్గర ప్రధాన లేఖకులుగా ఉద్యోగాలు చేస్తున్న నాగరాజు, రంగరాజు రమణయ్య మనసులో మెదిలారు. ఇద్దరూ అందంలోనూ, విధి నిర్వహణలోనూ ఒకరి కొకరు తీసిపోరు. తేడా అల్లా వారి స్వభావాల్లో మాత్రమే!

నాగరాజు కలుపుగోలు మనిషి. సరదాగా నవ్వుతూ మాట్లాడుతూంటాడు. తన సంపాదనలో చిల్లిగవ్వ కూడా మిగుల్చుకోడనీ, స్నేహితులూ, షికార్లూ అని వచ్చిన డబ్బు దుబారా చేస్తాడనీ అంతా చెప్పుకునేవాళ్ళు.

రంగరాజు స్వభావం ఇందుకు పూర్తిగా వ్యతిరేకం. అంతగా అవసరం వుంటే తప్ప, అతడు ఎవరితోనూ మాట్లాడడు. కనీస అవసరాలు కూడా తగ్గించుకుని పొదుపు చేస్తూ, ఎంతో డబ్బు కూడబెడుతున్నాడని చాలా మంది నమ్మకం. అతణ్ణి పరమపిసినారి అని కొందరు ఈసడించుకుంటే, రాబోయే భార్యను సుఖపెట్టడానికి ఇప్పటినుంచే డబ్బు దాస్తున్నాడని కొందరు మెచ్చుకునేవాళ్ళు.

రమణయ్య ఒకనాడు దివాణంలో నుంచి వస్తూనే, కూతురు దగ్గర ఆమె పెళ్ళి ప్రసక్తి

జి.సి. జీవి

తెచ్చాడు. నాగరాజు, రంగరాజుల గురించి నలుగురూ అనుకునేది క్లుప్తంగా ఆమెకు చెప్పి, ''జమీందారుగారి జన్మ దినం వేడుక లప్పుడు, అంతఃపురంలో వీళ్ళిద్దర్నీ నువ్వు చూశావు. ఈ ఇద్దరిలో నీకు ఎవరు నచ్చారో చెబితే, మిగతా విషయాలు నేను చూసు కుంటాను,'' అన్నాడు.

సునంద కొద్దిసేపు ఆలోచించి, ''నేను నాగరాజును పెళ్ళాడుతాను నాన్నా!'' అన్నది.

ఆ జవాబుకు రమణయ్య ఒక్కక్షణం ఆశ్చర్యపోయి, ''అదేమిటి తల్లీ! ఆ నాగరాజు డబ్బును నీళ్ళలా ఖర్చుపెడతాడనీ, పొదుపు అనే మాటే అతడు ఎరగడనీ అంటున్నా రందరూ. అటువంటి మనిషి రేపు భార్యాబిడ్డల్ని ఎలా పోషించగలడో ఆలోచించావా?'' అన్నాడు.

అందుకు సునంద వెంటనే, ''నాన్నా! ఆ నాగరాజు ఇప్పుడు తనకంటూ ఎవరూ లేరు కాబట్టి, ధారాళంగా ఖర్చుపెట్టుకుంటు న్నాడే గాని, అప్పుచేసి పప్పు కూడు తినడం లేదు కదా! అయినా, పెళ్ళయిన తర్వాత భార్యమీది ప్రేమతో ఖర్చులు తగ్గించుకుని, పొదుపుకు అలవాటు పడవచ్చు కదా? ఇక ఆ రంగరాజు, నా ఉద్దేశంలో పరమలోభి. అటువంటి మనిషి తాను సుఖపడడు; తన వారినీ సుఖపెట్టలేడు. అటువంటి మనిషిని పెళ్ళాడినేనేం సుఖపడగలను చెప్పు,'' అన్నది.

''ఒకవేళ వాళ్ళను గురించిన నీ అంచనా తప్పయితే?'' అన్నాడు రమణయ్య.

సునంద ఒకక్షణం మౌనంగా వూరుకుని, ''అయితే ఒక పని చెయ్యి, నాన్నా! నాగ రాజుకీ, రంగరాజుకీ ఒక చిన్న పరీక్షపెట్టు. అందులో ఎవరు నెగ్గితే, అతణ్ణే చేసు



కుంటాను,'' అని ఆ పరీక్ష ఏమిటో తండ్రికి చెప్పింది.

ఆ మర్నాటి సాయంకాలం దివాణం కార్యాలయంలో, ఏదో తీవ్రంగా ఆలో చిస్తూన్న వాడిలా కూర్చున్న రమణయ్యను చూసి నాగరాజు, ''చీకటిపడేవేళ అయినా, ఇంకా ఇంటికి వెళ్ళకుండా, ఇక్కడే వున్నారేమిటి?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు రమణయ్య తలాడించి, ''ఏం చెప్పమంటావయ్యా, నాగరాజూ! మా సునందకు ఒకమంచి పెళ్ళిసంబంధం వచ్చింది. వాళ్ళేమో కట్నం కింద వెంటనే పదివేలు ఇస్తేగాని, సంబంధం ఖాయం చేసుకునేది లేదని మొండికెత్తారు. నా దగ్గర ఇప్పుడంత డబ్బు లేదు. ఏం చేయాలా అని ఆలో చిస్తూన్నాను,' అన్నాడు.

ఆ జవాబుకు, నాగరాజు ఆశ్చర్యపోయి, ''చెరుకు తినడానికి కూలి అడగడమంటే, ఇదేనన్నమాట! అందచందాల్లోనూ, తెలివి తేటల్లోనూ ఎవరికీ తీసిపోని, మీ అమ్మాయే వెలలేని కానుక గదా! ఆమెను భార్యగా పొందడమే అదృష్టం. కళ్ళకద్దుకుని చేసు కోకుండా కట్నం ఏమిటి?'' అని ఆగి, ''నాకు కనీసం నాలుగు రోజులు గడువిస్తే, ఆ సొమ్ము నేను సర్దుతాను. మీరింటికి వెళ్ళి నిశ్చింతగా వుండండి,'' అని ధైర్యం చెప్పాడు.

''వచ్చిన జీతం డబ్బు వచ్చినట్టు ఖర్చు పెట్టే మనిషివి కదా, అంతడబ్బు ఎక్కడి నుంచి తేగలవు?'' అని అడిగాడు రమణయ్య.

నాగరాజు చిన్నగా నవ్వి, ''డబ్బున్న మంచి మనుషులెందరో నాకు స్నేహితులు. వాళ్ళకు నేనెన్నో ఉపకారాలు చేసివున్నాను. నేనడిగితే, ఆమాత్రం సహాయం చేయకపోరు,'' అన్నాడు.

అక్కడినుంచి బయలుదేరి రంగరాజు దగ్గరకు వెళ్ళాడు రమణయ్య. అతడికి తన డబ్బు అవసరం గురించి వివరించి, ''నువ్వెంతో పొదుపరివనీ, నాకు తప్పక సహాయపడగలవనీ నమ్మివచ్చాను. నాకొక పదివేలు సర్దావంటే, మూడోనెల ముగిసేలోపల నీ బాకీతీర్చేస్తాను,'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే రంగరాజు ముఖం వెలవెలపోయింది. అతడు కొద్దిసేపు తల వంచుకుని వూరుకుని, తర్వాత, ''ఏమను కోకండి. అప్పు ఇవ్వడమనేది, నా స్వభా వానికి విరుద్ధం. మీ అమ్మాయి పెళ్ళి, చేతిలో డబ్బున్నప్పుడే చేయొచ్చు గదా! మూడు నెలల తర్వాత, ఆ కట్నమేదో నాకే ఇస్తే మీ అమ్మాయిని నేనే చేసుకుంటాను,'' అన్నాడు.

ఆ జవాబుకు రమణయ్యకు కోపం వచ్చినా, ఏమీ మాట్లాడకుండా ఇంటికి తిరిగి వచ్చి, జరిగినదంతా కూతురుకు చెప్పాడు.

''ఇప్పటికైనా గ్రహించావా, నాన్నా; ఆ ఇద్దరిలో నీకు తగిన అల్లుడెవరో?'' అన్నది సునంద మెరిసే కళ్ళతో.

''చిన్నదానివైనా మనుషుల్ని అంచనా వెయ్యడంలో, నువ్వే గెలిచావు, తల్లీ,'' అని కూతురు తలను ప్రేమగా నిమిరాడు రమ ణయ్య. ఆ తర్వాత నెల తిరక్కుండానే, ఒక శుభముహూర్తాన సునంద, నాగరాజుల పెళ్ళి వైభవంగా జరిగింది.



57. ఇరావంతుడి మరణం

# మహాభారతం

యుద్ధం ఏడోరోజు తెల్లవారింది. కౌరవ సేనలను భీష్ముడు మండలవ్యూహంలో నిలబెట్టాడు. ధృతరాష్ట్రుడి కొడుకులు అనేక వేల రథాలూ, ఏనుగులూ గల సేనతో భీష్ముడికి రక్షకులుగా ఉన్నారు.

కౌరవవ్యూహాన్ని చూసి ధర్మరాజు తన సేనలను వజ్రం అనే వ్యూహంలో అమర్చాడు. యుద్ధం ఆరంభం కాగానే యోధులు ఒకరి వ్యూహాన్ని ఒకరు ఛేదించనారంభించారు. ద్రోణుడు విరాటుడితోనూ, అశ్వత్థామ శిఖండి తోనూ, దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడి తోనూ, నకుల సహదేవులు తమ మేనమామ అయిన శల్యుడితోనూ, విందానువిందులు ఇరావంతుడితోనూ, అనేక మంది కౌరవ వీరులు అర్జునుడితోనూ, భీముడు కృతవర్మ తోనూ, అభిమన్యుడు ధృతరాష్ట్రుడి కొడుకు లైన చిత్రసేన, వికర్ణ, దుర్మర్షణులతోనూ, అలంబుసుడు సాత్యకితోనూ, భూరిశ్రవుడు ధృష్టకేతుడితోనూ, ధర్మరాజు శ్రుతాయువు తోనూ యుద్ధం చేశారు.

అర్జునుడితో యుద్ధం చేస్తున్న వీరులు అతని పైన బాణవర్షం కురిపించారు. అర్జునుడు మండిపడి ఐంద్రాస్త్రం ప్రయోగించాడు. ఆ అస్త్రంతో అతనికి ఎదురుగా పోరాడుతున్న వారందరూ గాయపడ్డారు. అతని బాణాలు అంతటా పడుతున్నాయి. వాటి తాకిడికి తట్టుకోలేక కౌరవవీరులు భీష్ముణ్ణి శరణుజొచ్చారు.





అలా వచ్చిన వారిలో ముఖ్యుడైన సుశర్మతో దుర్యోధనుడు, ''భీష్ముడు అర్జునుడితో ప్రాణాలొడ్డి పోరాడబోతున్నాడు. మీరం దరూ ఆయనకు అండగా ఉండండి," అన్నాడు.

త్వరలోనే, కౌరవ వీరులను వెంటబెట్టు కుని భీష్ముడు అర్జునుడి మీద యుద్ధానికి వచ్చాడు.

ఈ లోపల విరాటుడితో యుద్ధం చేసిన ద్రోణుడు ముందు విరాటుడి సారథిని, గుర్రాలను చంపాడు. తరవాత విరాటుడు తన కొడుకైన శంఖుడి రథం ఎక్కి, తండ్రి కొడుకులిద్దరూ యుద్ధం చేసేటప్పుడు; ద్రోణుడు ఒక్క బాణంతో శంఖుణ్ణి చంపే శాడు. అది చూసి విరాటుడు పారిపోయాడు.

అలాగే శిఖండితో యుద్ధం చేస్తూ అశ్వ త్థామ అతని సారథినీ, గుర్రాలనూ చంపాడు. అప్పుడు శిఖండి కత్తి తీసుకుని, ఎంతో నేర్పుగా, అశ్వత్థామ తనపై ప్రయోగించే బాణాలన్నిటినీ ధ్వంసం చెయ్యసాగాడు. చివరకు శిఖండి చేతిలోని కత్తి విరిగిపోయింది. అతను దాన్ని అశ్వత్థామ పైకి విసిరి, తప్పించుకు పోయాడు.

అలంబుసుడితో సాత్యకి అద్భుతంగా పోరాడాడు. రాక్షసుడు అలంబుసుడు మాయాయుద్ధం ఆరంభించేసరికి, సాత్యకి, అర్జునుడు తనకిచ్చిన ఐంద్రాస్త్రాన్ని ప్రయో గించాడు. అలంబుసుడు తీవ్రంగా గాయ పడి పారిపోయాడు.

ధృష్టద్యుమ్నుడు దుర్యోధనుడితో యుద్ధం చేస్తూ, అతన్ని బాణవర్షంలో ముంచాడు; తరవాత దుర్యోధనుణ్ణి గాయపరచి అతని గుర్రాలను చంపాడు. దుర్యోధనుడు కత్తి తీసుకుని, రథం నుంచి దిగి, ధృష్టద్యుమ్నుడి మీదికి వచ్చాడు. ఇంతలో శకుని వచ్చి, దుర్యోధనుణ్ణి తన రథంలో ఎక్కించుకుని తీసుకుపోయాడు.

భీముడితో యుద్ధం చేసిన కృతవర్మ భీముణ్ణి గాయపరచి తాను గాయపడి, తన గుర్రాలను పోగొట్టుకుని, తన బావ అయిన వృషకుడి రథం ఎక్కాడు. ఇది దుర్యోధనుడి కళ్ళ ఎదటే జరిగింది.

ఉలూపికీ, అర్జునుడికీ పుట్టిన కొడుకు, తనతో యుద్ధం చేసిన విందానువిందులను పారిపోయేదాకా బాణాలతో కొట్టాడు.

ఘటోత్కచుడికీ, భగదత్తుడికీ మధ్య యుద్ధం చిత్రంగా జరిగింది. భగదత్తుడు పెద్ద ఏనుగు నెక్కి పాండవ సైన్యాన్ని చిందర వందర చేశాడు. తమను కాపాడే వాడెవడూ

లేక పాండవ సేనలు పారిపోసాగాయి. ఘటో త్కచుడు అకస్మాత్తుగా మాయమయ్యాడు. ఇంతలో కౌరవసేనలో హాహాకారాలు చెల రేగాయి. ఘటోత్కచుడు మళ్ళీ కనిపించి, భగదత్తుడి మీద బాణ వర్షం కురిపించాడు. భగదత్తుడు ఘటోత్కచుణ్ణి బాణాలతోనూ, తోమరాలతోనూ కొట్టాడు. చివరకు ఘటో త్కచుడు యుద్ధం చెయ్యలేకపారిపోయాడు.

నకుల సహదేవులు తమ మేనమామ అయిన శల్యుడితో యుద్ధం చేసి, మహా వీరుడైన ఆయనను మూర్ఛపోగొట్టారు. శల్యుడి రథాన్ని సారథి దూరంగా తీసుకు పోయాడు. నకుల సహదేవులు గెలిచి సింహ నాదాలు చేస్తూంటే కౌరవులు నిరుత్సాహం చెందారు. అప్పటికి మధ్యాన్నమయింది.

అభిమన్యుడికీ, ధృతరాష్ట్రుడి కొడుకు లకూ జరిగిన యుద్ధంలో అభిమన్యుడు చిత్ర సేన, వికర్ణ, దుర్మర్షణులు ముగ్గురి రథాలూ ధ్వంసం చేశాడు. అది చూసి అభిమన్యుడి పైకి కౌరవయోధులు వచ్చిపడ్డారు. అప్పుడు అభిమన్యుడికి సహాయంగా అర్జునుడు వేగంగా వచ్చాడు. రెండు పక్షాలకూ సంకుల యుద్ధం జరిగింది. అర్జునుడి బాణాలు అంద రినీ బాధించాయి. సుశర్మ బంధువులు చాలామంది అర్జునుడి చేతిలో చచ్చారు. సుశర్మ ఆవేశంతో కొంతమంది యోధులను వెంటబెట్టుకుని అర్జునుడి పైకి వచ్చాడు.

అర్జునుడు వారినందరినీ ఓడించి, భీష్మణ్ణి ఎదిరించటానికి ముందుకుసాగాడు. మధ్య దారిలో అతను రెండు గడియల సేపు దుర్యో ధనుడు, సైంధవుడు మొదలైన వారితో యుద్ధం చెయ్యవలసి వచ్చింది.



అర్జునుడు భీష్మణ్ణి చేరవచ్చేసరికి అక్క డికి ధర్మరాజూ, భీమనకుల సహదేవులు కూడా వచ్చారు. ఆ విధంగా పాండవులు అయిదుగురూ భీష్ముడితో ఒకేసారి తల పడటం జరిగింది.

అంతమందీ కలిసి కూడా భీష్మణ్ణి పీడించలేకపోయారు. ఇంతలో సైంధవుడు వచ్చి, పాండవుల విల్లులన్నీ ఖండించాడు. దుర్యోధనుడు ధర్మరాజునూ, నకుల సహ దేవులనూ బాణాలతో కొట్టి బాధించాడు. శల్యుడు మొదలైన కౌరవపక్షయోధులు పాండవులను అతి తీవ్రంగా బాణాలతో కొట్టారు.

ధర్మరాజు శిఖండి వద్దకు వెళ్ళి, ''నువ్వు భీష్మణ్ణి చంపుతానన్నావు. భీష్ముడు చూడు, ఎలాటి దారుణయుద్ధం చేస్తున్నాడో! నాకు



ఆ గదను తప్పించుకోవటానికి దుర్యోధనుడి మనుషులు, దుర్యోధనుణ్ణి ఒంటరిగా విడిచి బెదిరి పారిపోయారు. అలా భీముడి గద దెబ్బనుంచి తప్పించుకుని, నేలమీద దూకి రథం ధ్వంసం కాగా, ప్రాణాలతో బయట పడిన చిత్రసేనుణ్ణి అందరూ అభినందించారు. ధృతరాష్ట్రుడి కొడుకైన వికర్ణుడు చిత్ర సేనుణ్ణి తన రథం మీద ఎక్కించుకున్నాడు. కొంతసేపటికి శిఖండి భీష్ముడికి ఎదురుగా వచ్చి, "నిలు, నిలు!" అని కేక పెట్టాడు. కాని భీష్ముడు అతనితో యుద్ధం చెయ్యలేదు.

సూర్యాస్తమయం కావచ్చేవేళకు ధృష్ట ద్యుమ్నుడూ, సాత్యకీ కౌరవ బలాలను విప రీతంగా ధ్వంసం చేయనారంభించారు. అప్పుడు విందానువిందులు ధృష్టద్యుమ్నుణ్ణి ఎది రించి, అతని రథాన్ని భగ్నం చేశారు. అతను సాత్యకి రథం ఎక్కాడు.

ఆ రోజు యుద్ధం ముగిసేలోపల అర్జు నుడు సుశర్మ మొదలైనవారిని ఓడించాడు; భీముడు దుర్యోధనుడు మొదలైన వారిని జయించాడు. ఉభయ పక్షాలవారూ తమ తమ శిబిరాలకు వెళ్ళిపోయారు. శిబిరాలు చేరగానే వాళ్ళు తమ శరీరాలలో గుచ్చు కున్న బాణాలు మొదలైనవి తీయించు కుని, చక్కగా స్నానాలు చేసి, యుద్ధం గురించి ఆలోచించటం మాని, కొంతసేపు గీత వాద్యాలను సుఖంగా అనుభవించారు.

మర్నాడు ఉదయం మళ్ళీ ఉభయసేనలూ యుద్ధానికి ఉపక్రమించాయి. వ్యూహాలూ, ప్రతివ్యూహాలూ పన్నిన అనంతరం యుద్ధం ఆరంభమయింది. ఆరంభం నుంచీ భీష్ముడు రుద్రుడు లాగా తయారయ్యాడు. అది

చూడగా నువ్వు భీష్ముడంటే బెదరినట్టు కని పిస్తున్నది. వచ్చి భీష్ముణ్ణి చంపు," అన్నాడు.

ఈ మాటలు విని శిఖండి భీష్ముడితో యుద్ధం చెయ్యటానికి బయలుదేరాడు. దారిలో శల్యుడు శిఖండి మీద ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. శిఖండి బెదరక, దానికి ప్రతిగా వారుణాస్త్రం ప్రయోగించాడు.

ఈలోపల భీష్ముడు ధర్మరాజు విల్లునూ, ధ్వజాన్నీ విరగగొట్టి, సింహనాదం చేశాడు. ధర్మరాజు బెదిరిపోయాడు.

భీముడు గద తీసుకుని సైంధవుడి మీదికి వెళ్ళాడు. సైంధవుడు తనపై వేసే బాణాలను లక్ష్యపెట్టక, అతని గుర్రాలను గదతో మోది చంపాడు. అప్పుడు దుర్యో ధనుడు భీముడి మీదికి వచ్చాడు. భీముడు గద తీసుకుని అతని మీదికి కూడా వెళ్ళాడు.

చూసి ధర్మరాజు ముఖ్య యోధులందరినీ భీష్ముడి మీదికే పంపాడు.

భీష్ముడు సోమకులనూ, సృంజయులనూ, పాంచాలులనూ వధించసాగాడు. ఆయనకు ఎదురుగా నిలబడి యుద్ధం చేసినవాడు భీముడు ఒకడే. అతను కూడా భీష్ముడంత భయంకరంగానూ ఉండటమేకాక, భీష్ముడి సారథిని చంపి, భీష్ముడి రథం తొలగిపోయే టట్టు చేసి, భీష్ముడికి అండగా యుద్ధం చేస్తున్నవారిలో ధృతరాష్ట్రుడి కొడుకైన సునా భుడు అనే వాణ్ణి ఒక్క తీవ్రమైన బాణంతో తల నరికాడు.

అది చూసి ధృతరాష్ట్రుడి కొడుకులు మరి ఏడుగురు – ఆదిత్యకేతువూ, బహ్వాశీ, కుండధారుడూ, మహోదరుడూ, పండిత కుడూ, అపరాజితుడూ, విశాలాక్షుడూ అనే వారు – భీముడిపైకి వచ్చారు. భీముడు ఆ ఏడుగురినీ బాణాలతో కొట్టి చంపాడు.

ఇది చూసి దుర్యోధనుడి మిగిలిన తమ్ము లకు దడపుట్టింది. దుర్యోధనుడు దుఃఖిస్తూ భీష్ముడి వద్దకు వెళ్ళి, "తాతా, నా తమ్ము లందరినీ భీముడు చంపేస్తున్నాడు. ధైర్యంగా నిలబడి పోరాడేవాళ్ళందరినీ భీముడు చంపుతున్నాడు. నువ్వు మా పట్ల శ్రద్ధ వహిం చటం లేదు," అన్నాడు.

భీష్ముడికి కోపం వచ్చింది. ఆయన ఏడు స్తున్న దుర్యోధనుడితో, "ఈ సంగతి ముందు నీకు తెలీదా? మేమంతా ముందే చెప్పలేదా? నీ తమ్ములు ఎవరు దొరికినా భీముడు చంపక విడవడు. నన్నూ, ద్రోణుణ్ణీ ఈ యుద్ధంలో ఇరికించకుండా ఉండవలసింది. నువ్వే నీ పరాక్రమంతో పాండవులను చంపు," అన్నాడు.



మధ్యాన్నం వేళకు యుద్ధం చాలా తీవ్ర స్థాయికి వచ్చింది. మహాదారుణమైన యుద్ధం చేస్తున్న భీష్ముడి మీదికి ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ, శిఖండీ తమ సేనలతో సహా వచ్చారు. అలాగే విరాటుడూ, ద్రుపదుడూ సోమ కులను వెంటబెట్టుకుని వచ్చారు. ఇంకా కైకయులూ, ధృష్టకేతువూ, కుంతిభోజుడూ తమ సేనలతో భీష్ముడి పైకి వచ్చారు. అర్జు నుడూ, ఉపపాండవులూ, చేకితానుడూ ఇతరకౌరవయోధులతో యుద్ధం చేశారు. అభి మన్యుడూ, భీముడూ, ఘటోత్కచుడూ మరొక పక్కనుంచి కౌరవ సైన్యాన్ని ధ్వంసం చెయ్యసాగారు.

కౌరవయోధులు అదేవిధంగా పాండవ సేనను నాశనం చేశారు. ద్రోణుడు సోమక సృంజయులను వధ చేశాడు. భీముడి చేత

చచ్చే కౌరవసేనలూ, ద్రోణుడి చేత చచ్చే పాండవసేనలూ హాహాకారాలు చెయ్యటం వినిపించింది. ముమ్మరంగా సాగే ఆ యుద్ధంలో అర్జునుడి కొడుకైన ఇరావంతుడు కౌరవ సేనపై విరుచుకుపడ్డాడు.

ఇరావంతుడి తల్లి, నాగరాజైన ఐరావతుడి కూతురు. ఆమె భర్తను గరుత్మంతుడు చంపేసిన మీదట, ఐరావతుడు ఆమెను అర్జునుడి వద్దకు పంపాడు. ఆమె అర్జునుణ్ణి ప్రేమించి, అతని వల్ల ఈ ఇరావంతుణ్ణి కన్నది. ఇరావంతుడు నాగలోకంలోనే తల్లి వద్ద పెరుగుతూ వచ్చాడు. కాని ఇతని పినతండ్రి అయిన అశ్వసేనుడికి అర్జునుడిపై ద్వేషం ఉండేది. అందుచేత అశ్వసేనుడు ఇరావంతుణ్ణి నాగలోకం నుంచి తరుమగొట్టాడు.

ఆ సమయంలో అర్జునుడు ఇంద్రలోకంలో ఉన్నాడు. ఆ సంగతి తెలిసి ఇరావంతుడు అక్కడికి వెళ్ళి, అర్జునుణ్ణి కలుసుకుని, తన పుట్టుపూర్వోత్తరాలు తెలిపాడు. అన్నివిధాలా తన అంతవాడైన ఇరావంతుణ్ణి చూసి అర్జునుడు చాలా సంతోషపడి, "యుద్ధం వచ్చినప్పుడు నువ్వు మాకు సహాయం రావాలి," అన్నాడు. ఆ మాట గుర్తుంచుకుని ఇరావంతుడు పాండవులకు యుద్ధ సహాయం చెయ్యటానికి మేలుజాతి యవనాశ్వాలను వెంటబెట్టుకుని వచ్చాడు.

ఇరావంతుడు తన అశ్వసేనతో విజృంభించి కౌరవసేన మీదికి వచ్చేసరికి, శకుని తమ్ములైన గజుడూ, గవాక్షుడూ, వృషభుడూ, చర్మవంతుడూ, అర్జవుడూ, శుకుడూ అనే ఆరుగురూ, శకుని వద్దంటున్నా వినకుండా సాహసించి, ఇరావంతుడి అశ్వసేనతో యుద్ధానికి వచ్చారు. వాళ్ళు తనతో యుద్ధం చేసి తనను బాణాలతో హింసిస్తుంటే, ఇరావంతుడు కత్తి తీసుకుని ఆత్మరక్షణ చేసుకుంటూ, వృషభుడనే వాణ్ణి తప్ప మిగిలిన అయిదుగురినీ చంపేశాడు.

ఇది చూసి దుర్యోధనుడు ఇరావంతుడిపైకి ఆర్ష్యశృంగుడనే రాక్షసుణ్ణి యుద్ధానికి పంపాడు.

ఇద్దరూ చాలాసేపు మహాదారుణంగా పోరాడిన మీదట, ఇరావంతుడు మూర్ఛపోయాడు. ఆ సమయంలో ఆ రాక్షసుడు అతన్ని కత్తితో నరికి చంపాడు. కౌరవసేనలు హర్షించాయి.





# నమ్మకం

నాగులపాలెంలో వుండే రోశయ్య చాలా తెలివైనవాడు. కానీ మోసగాడని పేరు. రోశయ్య తన తెలివికి మురిసిపోతూంటాడు తప్ప, జనం తనను మోసగాడంటున్నారని బాధపడడు.

ఇలా వుండగా– ఆ ఊళ్ళోని శంకరుడికి పెద్దకష్టం వచ్చింది. దానినుంచి బయట పడేందుకు కొంతపొలం అమ్ముకోవలసి వచ్చింది. అయినా అప్పులు పూర్తిగా తీర లేదు. అప్పులవాళ్ళలో ముకుందుడనే వాడు తనబాకీ వెంటనే తీర్చమని, శంకరుడి పీకల మీద కూర్చున్నాడు.

ముకుందుడికీ, రోశయ్యకూ మంచి స్నేహం వుంది. శంకరుడు, రోశయ్యను కలుసు కుని, ''నువ్వు చాలా మంచివాడివి. నువ్వొక్క మాట చెబితే ముకుందుడు వింటాడు. పది రోజుల్లో అతడి బాకీ పువ్వుల్లో పెట్టి ఇవ్వ గలను. ఎలాగో అలా నువ్వు ముకుందుణ్ణి పదిరోజులుఆపు,'' అని బ్రతిమాలుకున్నాడు.

రోశయ్య కాసేపాలోచించి, ''ముకుం దుడు డబ్బు దగ్గర చాలా గట్టివాడు. అతడు డబ్బు విషయంలో నామాట వినడు. అయితే, అతడికి నా మీద నమ్మకం ఎక్కువ కాబట్టి, నేను హామీ వుంటానంటే ఒక పదిరోజుల పాటు ఆగవచ్చు. పదిరోజుల తర్వాత నువ్వు బాకీ తీర్చకపోతే మాత్రం అతడికా డబ్బు నేనిచ్చు కోవాల్సి వుంటుంది,'' అన్నాడు.

శంకరుడు వెంటనే, ''నువ్వు నన్ను నమ్ము. పది రోజుల్లో అతడిబాకీ తప్పక నేను తీర్చే స్తాను. నీకేఇబ్బందీ రానివ్వను,'' అన్నాడు.

రోశయ్యనవ్వి, ''నేను నిన్ను నమ్ముతాను. కానీ నీకు నామీద ఏమాత్రం నమ్మకముందో తెలుసుకోవాలి గదా! నీ భార్యమెడలోని వజ్రాలహారమంటే, నాభార్యకు చాలా ఇష్టం. ఈ పదిరోజులూ ఆ హారాన్ని నా భార్యకిస్తే, ఆమెదాన్ని వేసుకుని సంతోషిస్తుంది. ఇది తాకట్టు అనుకోకు. నీ నమ్మకానికి పరీక్ష. అంతే! ''అన్నాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి

ఆ వజ్రాలహారం శంకరుడి ఇంట వంశ పారంపర్యంగా వస్తున్నది. ఎట్టి పరిస్థితుల్లోనూ అతడు దానిని అమ్ముకోడు. లేకుంటే అది కోటిరూపాయల విలువ చేస్తుంది. దాన్ని రోశయ్యకు ఎరువుగా ఇవ్వడానికి శంకరుడికి అభ్యంతరమేమీ లేదు. కానీ రోశయ్య మీద అతడికి ఏమాత్రం నమ్మకం లేదు. ఒకసారి హారం తన చేతికి వచ్చాక, రోశయ్య దాన్ని తిరిగి ఇవ్వడు. కొనేసుకున్నాననో, మరేదో అబద్ధం చెబుతాడు.

శంకరుడు చేసేదిలేక రోశయ్యకు ఏ మాటా ఇవ్వకుండా, అక్కణ్ణించి తప్పుకున్నాడు. ఆ సాయంత్రం రోశయ్య ఈ విషయం నలుగురికీ చెప్పి, ''మనిషన్నాక నమ్మకముండాలి. నమ్మకం లేక శంకరుడు గోటితో పోయేదానికి గొడ్డలి దాకా వెళుతున్నాడు. నమ్మి హారాన్ని నాకిస్తే, మళ్ళీ తిరిగివ్వనా?'' అన్నాడు.

ఆ ఊళ్ళో నగలవర్తకుడు భూషయ్యకు ఇది తెలిసింది. ఆయన వెంటనే ఒక నగ తీసుకుని రోశయ్య ఇంటికి వెళ్ళి, '' ఈ నగ చూడు! పనితనంలో ఇది శంకరుడి వజ్రాల హారానికి తీసిపోదు. ఎటొచ్చీ దీని విలువ వెయ్యి రూపాయలు మాత్రమే. దీన్ని నీవద్ద నూరు రూపాయలకు తాకట్టు పెడతాను. నీ వంటి తెలివైన వాడి దగ్గర్నుంచి తీసుకున్న అప్పు, నాకు లాభిస్తుందని ఒక జ్యోతిష్కుడు చెప్పాడు. నెలరోజుల్లో మళ్ళీ నీకు నూరు రూపాయలూ తిరిగిచ్చి హారాన్ని తీసుకుంటాను,'' అన్నాడు.

దీనికి రోశయ్య ఆశ్చర్యపడి, '' ఈ ఊళ్ళో తెలివైన వాళ్ళే కరువయ్యారా? దీనికి నన్నే ఎందుకు ఎంచుకున్నావు?''అని అడిగాడు.



''నమ్మకం గురించి నువ్వు నలుగురికీ చెప్పిన మాటలు, నాకెంతో నచ్చాయి. ఈ ఊళ్ళో నిన్ను మించి నమ్మదగ్గ మనిషి మరొకడుండడనిపించింది,''అన్నాడు భూషయ్య.

రోశయ్య,భూషయ్యకునూరు రూపాయలు ఇచ్చి నగ తీసుకున్నాడు. నెల రోజులు గడిచాక భూషయ్య, రోశయ్య వద్దకు వెళ్ళి, ''నీ నూరు రూపాయలూ తిరిగిస్తున్నాను. నా నగ నాకు తిరిగివ్వు,'' అన్నాడు.

అందుకు రోశయ్య నవ్వి, ''నువ్వు నాకు నగ ఇచ్చినట్లు పత్రమా, సాక్ష్యమా? నాసంగతి తెలిసీ, నిన్ను నాకు నగ ఎవరిమ్మన్నారు? ఎన్నడూ ఇలా ఎవర్నీ నమ్మి మోసపోకు. నీ నూరు రూపాయలు నువ్వే వుంచుకో,'' అన్నాడు.

అయితే భూషయ్య ఊరుకోలేదు. పది మందినీ పిలిచి రభస చేశాడు. రోశయ్య



వారందరితో కూడా, "వెయ్యి రూపాయల నగను నూర్రపాయలకే నానుంచి లాగేయాలని, ఈ భూషయ్య పన్నాగం పన్నాడు. లేకుంటే ఒక నగలవ్యాపారి పత్రం, సాక్ష్యం లేకుండా, ఈవిధంగా నాకు నగ ఇస్తాడా?" అంటూ ఎదురు ప్రశ్నించాడు.

అక్కడ చేరిన వారందరూ భూషయ్యనే తప్పుపట్టి, "నీమాటలు నమ్మతగ్గవిగా లేవు. ఇంతకాలంగా రోశయ్యమాత్రమే మోసగాడనుకున్నాం. అయితే ఈ రోజు మోసంలో నువ్వూ, అతడికి తీసిపోవని తేలిపోయింది. అయినా నువ్విలా ఎందుకు చేశావు?" అని అడిగారు.

భూషయ్య ఒక్కక్షణం గొంతు సవరించుకుని, "చెబుతాను, వినండి! ఒక దొంగ ఈ హారాన్ని ఎక్కడో దొంగిలించి, రోశయ్యకు అమ్మజూపాడు. రోశయ్య ఈ హారాన్ని నాకు చూపించి, ధర ఎంత వుంటుందో అంచనా వెయ్యమంటే, వెయ్యి రూపాయలుంటుందని చెప్పాను. రోశయ్య దీన్ని దొంగనుంచి నూర్రూపాయలకు కొన్నాడు. తర్వాత రాజభటులు నా వద్దకు వచ్చి, ఇలాంటి నకిలీ హారాన్ని చూపి, అలాంటి బంగారు హారాన్నెవరైనా అమ్మజూపితే, తమకు చెప్పమన్నారు. ఈ విషయం నేను వెంటనే రోశయ్యకు చేరవేసి — అది దొంగసొమ్మనీ, రాజభటులకు అప్పచెప్పమనీ అన్నాను. రోశయ్య నామాట వినలేదు సరికదా, విషయం బయట పెడితే, నేనే తనకు హారాన్నిచ్చానని అందరికీ చెబుతానని, ఒక కట్టుకథ కల్పించాడు. అందుకని నేను తెలివిగా నాటకమాడి, ఈ హారం అతడిదేనని, మీ అందరి ముందూ ఒప్పించాను. ఇకఈహారానికీ నాకూ సంబంధం లేదనడానికి, మీరందరూ సాక్ష్యం. నా బరువు దిగిపోయింది!" అనేసి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

రోశయ్య నోటమాట పెగలలేదు. భూషయ్య పొరబాటున దొంగసొమ్ము కొన్నాడనీ, ఆ విషయం బయటపడవచ్చునని అనుమానం రాగానే, దాన్ని తెలివిగా తనకు అంటగట్టా డనీ అతడికి అర్థమైంది. కానీ ఇప్పుడు తనేం చేయగలడు?

మర్నాటికల్లా రాజభటులు వచ్చి, రోశయ్యను బంధించి తీసుకువెళ్ళారు. తను నేరస్థుణ్ణికాదని ఋజువు చేసుకోలేని రోశయ్య, హారాన్ని న్యాయాధికారికి అప్పజెప్పి, రెండువందలరూపాయలు జరిమానా కట్టిబయటపడ్డాడు. ఇంటికివెళుతూ, అతడు దారిలో భూషయ్యను కలుసుకుని, ''నేను నిన్నెప్పుడూ మోసం చేయలేదు కదా! మరి నువ్వు నన్నెందుకిలా మోసం చేశావు?'' అని అడిగాడు.

''నేను నిన్ను మోసం చేయలేదు. నగయిచ్చి నూర్రూపాయలు తీసుకున్నాను. మళ్ళీ నగతీసుకునేందుకు నూర్రూపాయలూ తెచ్చాను. అత్యాశకుపోయి, నిన్ను నువ్వే మోసం చేసుకున్నావు తప్ప, ఇందులో నేను చేసిన మోసమేముంది?'' అన్నాడు భూషయ్య.

రోశయ్య తలదించుకుని, ''నువ్వు చెప్పింది నిజమే! నా చెడ్డబుద్ధే నన్ను మోసం చేసిందిలే,'' అన్నాడు.

దానికి భూషయ్య నవ్వి, ''నేను మోసగాళ్ళకు మోసగాణ్ణి, మంచివాళ్ళకు మంచివాణ్ణి. తెలివిగా హారాన్ని నీకు అంటగట్టినట్లే, శంకరుణ్ణి నమ్మి ముకుందుడి అప్పు విషయంలో హామీ కూడా ఇచ్చాను. ఏ పత్రమూ, సాక్ష్యమూ లేకుండా. పది రోజుల్లో శంకరుడు, ముకుందుడి బాకీ తీర్చేశాడు. మోసగాళ్ళపట్లా, మంచివాళ్ళ పట్లా కూడా నా నమ్మకం ఎన్నడూ తప్పవలేదు,'' అన్నాడు.

రోశయ్య మరిమాట్లాడకుండా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. ఆ తర్వాతనుంచీ అతడు తన తెలివి తేటల్ని మోసం పనులకు ఉపయోగించలేదు.





# చందమామ

## భారత దర్శనం పాఠకులకు క్విజ్

ఈ సంచికలోని ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో ప్రచురిస్తాం. ఈలోగా వాటి సమాధానాలు తెలుసుకోగలరేమో ప్రయత్నించి చూడండి.

1



1. (ఎ) దక్షిణ ప్రాంతానికి చెందిన పూజారులు పూజాకార్యక్రమాలు నిర్వర్తించే ఉత్తర భారతదేశంలోని దేవాలయం ఏది?

(బి) ఒక ముస్లిం భక్తుడి గౌరవార్థం దక్షిణ భారతదేశంలోని ఒక హైందవ ఆలయంలో ఇస్లాం మతశైలిలో కొన్ని క్రతువులు జరుపుతారు. ఆ దేవాలయం ఏదో మీకు తెలుసా?

(సి) అన్న బలభద్రుడు, చెల్లెలు సుభద్ర సమేతంగా వున్న శ్రీకృష్ణుణ్ణి ఏ దేవాలయంలో ఆరాధిస్తారు?

(డి) భరద్వాజ ముని ఆశ్రమం ఉన్న ప్రదేశంలో వెలసిన సుప్రసిద్ధ నగరం ఏది?

(ఇ) వ్యాసమహర్షి మహాభారతాన్ని రచించిన స్థలం అని చెప్పబడే గుహ ఎక్కడ ఉన్నది?

2

ఒక రాజుకు మగసంతానం లేదు. ఒకే ఒక కుమార్తె. ఆమె అద్భుత సౌందర్యరాశి. అంతకు మించిన ధైర్యవంతురాలు. ఆమెకు రాజు క్షత్రియోచిత విద్యలు నేర్పాడు. రాజ్యానికి వారసులు కావాలి గనక, మగబిడ్డను దత్తత తీసుకోమని శ్రేయోభిలాషులు రాజుకు సలహా ఇచ్చారు. అయినా రాజు అంగీక రించలేదు. తన కుమార్తె సమర్థవంతంగా రాజ్యపాలన చేయగలదని ఆయన విశ్వ సించాడు.

రాజు మరణానంతరం ఆయన కుమార్తె సింహాసనం అధిష్ఠించి ప్రజారంజకంగా రాజ్యపాలన చేయసాగింది. అయితే, ఇరుగు పొరుగు రాజకుమారులు ఆమెను వివాహమాడడానికి ప్రయత్నించారు. కాని ఆమె అందరినీ తిరస్కరించింది. దాంతో వారందరూ ఒకటిగా కలిసి, సైన్యంతో ఆమె రాజ్యం మీద విరుచుకుపడ్డారు. ఆమె స్వయంగా చేత కత్తిపట్టి యుద్ధరంగానికి వెళ్ళి శత్రుసేనలను చీల్చిచెండాడింది. రాజకుమారులు ఓటమికి సిగ్గుపడుతూ పారిపోసాగారు. ఉన్నట్టుండి ఆమె గుర్రం ముందు ఒక పురుషమూర్తి కనిపించాడు. ఆయన శత్రురాజు కాదు. తనకు కాబోయే భర్త అని ఆమె గ్రహించింది. ఇరువురూ వివాహమాడారు.

తమను పాలిస్తున్న రాణి మానవరూపంలో వున్న జగన్మాత అనీ ఆమెను పెళ్ళాడింది పరమశివుడనీ ప్రజలు క్రమంగా గ్రహించారు. ఆ ఇద్దరినీ భారత దేశంలోని అతి ప్రాచీనమైన గొప్ప దేవాలయంలో ఈనాటికీ పూజిస్తున్నారు. ఆ దేవాలయం ఎక్కడ వున్నది? అందులోని దేవుళ్ళ పేరేమిటి?



# జూలై నెల సృజనాత్మక పోటీ!

*గురువు ప్రయాణం చేయడానికి ఒక గుర్రం కొనాలని శిష్యులు కొందరు సంతకు వెళ్ళారు. గుర్రం ధర మరీ ఎక్కువగా ఉండడంతో గుర్రంగుడ్డుకొని పొదిగించుకుంటే చవగ్గా గుర్రం వస్తుందని ఆలోచిస్తూ ఆశ్రమానికి తిరిగి వచ్చారు. ''అద్భుతమైన'' వాళ్ళ ఆలోచనను గురువు అభినందించాడు. ఆ తరవాత గురుశిష్యుల ప్రయత్నం ఏమయింది?*

బహుమతి పొందిన రచన

## మహాజ్ఞాని - మహాశిష్యులు

గురువుగారి మెప్పుతో పరమానందం చెందిన శిష్యులు గుర్రంగుడ్డు కోసం అడవి మార్గాన బయలుదేరారు. దారిలో వాళ్ళకొక గొర్రెల కాపరి కనిపించాడు. వాళ్ళు, ''గుర్రం గుడ్డు ఎక్కడ దొరుకుతుంది?'' అని అడిగారు. వాడు పకపకా నవ్వి, ''గుర్రం గుడ్డూ లేదు, పాడూ లేదు, వెళ్ళండి, వెళ్ళండి,'' అన్నాడు. వాళ్ళు మరికొంత ముందుకు వెళ్ళి ఒక చెట్టు కింద ధ్యాననిమగ్నుడై వున్న ఒక సాధువును సమీపించి అదే ప్రశ్న అడిగారు. సాధువు కళ్ళు తెరిచి, ''మీరు మహాజ్ఞానుల్లా ఉన్నారు! ఎవరి శిష్యులు నాయనా!'' అని అడిగాడు. 'వేరే చెప్పాలా? మా గురువు మహాజ్ఞాని!'' అన్నారు శిష్యులు. ''అలాగా! చాలా సంతోషం. వెళ్ళిరండి నాయనా!'' అంటూ సాధువు మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

శిష్యులు మరికొంత ముందుకు వెళ్ళేసరికి ఒక మోసగాడు ఎదురుపడ్డాడు. శిష్యుల వాలకం చూసి వెర్రివాళ్ళని గ్రహించాడు. వాళ్ళు గుర్రంగుడ్డు గురించి అడిగారు. ''గుర్రంగుడ్డే కదా? క్షణంలో తెస్తాను,'' అంటూ కొండచాటుకు వెళ్ళి గుండ్రంగా వున్న తెల్లరాయిని గుడ్డులాగా మరీ నున్నగా అరగదీసి తెచ్చి వాళ్ళకిచ్చాడు. తర్వాత వాడు సొమ్ము పుచ్చుకుని, ''జాగ్రత్త! ఈ గుర్రంగుడ్డు నుంచి ఏ క్షణంలోనైనా పంచకల్యాణిలాంటిగుర్రపిల్ల బయటకు రాగలదు. మీ అదృష్టం బావుంటేమరికొన్ని క్షణాలలో పెరిగి అది మిమ్మల్ని భూప్రపంచమంతా తిప్పవచ్చుకూడా!'' అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

నలుగురు శిష్యులూ ఆ గుడ్డును పట్టుకుని, ''జాగ్రత్త, జాగ్రత్త!'' అంటూ నడవసాగారు. కొంతదూరం వెళ్ళేసరికి అది పట్టుతప్పి కిందవున్న చిన్న పొదలో పడింది. పొదలోవున్న కుందేలు బెదిరి పరుగు తీసింది. ''తెల్ల గుర్రంపిల్ల పారిపోతోంది. పట్టుకోండి! పట్టుకోండి!'' అంటూ దానివెంట పరిగెత్తారు. అయితే అది క్షణంలో ఎటో వెళ్ళిపోయింది. కాని దూరంగా ఒక గాడిద మేస్తూ కనిపించింది. ''ఆహా! ఎంతలో ఎంతయింది? అదే జాతి గుర్రం!'' అని ఆశ్రమానికి తోలుకువచ్చారు. దానిపై గురువును కూర్చోబెట్టి నగర విహారానికి తీసుకువెళ్ళారు. వాళ్ళను చూసి జనం పగలబడి నవ్వారు. కొందరు డప్పులు వాయించడంతో బెదరిపోయిన గాడిద, గురువును కింద పడదోసి ఓండ్రపెడుతూ అడవిలోకి పారిపోయింది.

మహాశిష్యుల కారణంగా, మహాజ్ఞాని గాడిదపై సవారి చేసి నలుగురిలో నవ్వుల పాలయ్యాడు!

- పూకాటి ప్రవీణ
D/o. శ్రీనివాసులు
తలుపూరు
నెల్లూరు జిల్లా - 524 409. (ఆం.ప్ర)



# కపట వైద్యుడు

కుంభీనస నగరంలో ఒక కపటవైద్యుడుండే వాడు. అతని పేరు శివబైరాగి. ఈ వైద్యుడు తాను సమస్తవ్యాధులూ నయం చెయ్య గలనని చెప్పుకుంటూ, గొప్ప వైద్యుడని కొందరిని నమ్మిస్తూ పొట్టపోసుకునేవాడు. అతని వద్ద ఏవేవో భస్మాలూ, అంజనాలూ, మాత్రలూ, కుప్పెలూ, రసాయనాలూ ఉండేవి.

ఒకసారి ఆ దేశపు యువరాజుకు ఒక వింత జాడ్యం సంప్రాప్తమయింది. అతనికి ఆకలిదప్పులు పోయాయి. నీరసంగా మంచాన పడిఉంటాడు. తానై ఎవరితోనూ మాట్లాడడు. ఎవరైనా పలకరిస్తే చిరాకుగా సమాధాన మిస్తాడు. దిగులుగా ఉంటాడు.

రాజవైద్యులకు యువరాజు రుగ్మత ఏమిటో, అది ఎలా సంప్రాప్తమయిందో అంతు చిక్కలేదు. వాళ్ళు అనేక ఔషధాలు వాడి చూశారు గాని, వాటివల్ల ఏ ప్రయో జనమూ లేకపోయింది.

యువరాజు అనారోగ్యం గురించి రాజు గారికి బెంగపట్టుకున్నది. మంత్రులూ, ఇతర రాజోద్యోగులూ శివబైరాగిని పిలి పించమని సలహా ఇచ్చారు.

"ఛీ, ఛీ! వాడేం వైద్యుడు? అపర ధన్వంత రులలాటి ఆస్థానవైద్యులకు అంతుబట్టని వ్యాధి, ఆ మందులమ్ముకునేవాడికి అంతు పడుతుందా?" అన్నాడు రాజు.

"అలా అనటానికి లేదు, మహారాజా! ఘనవైద్యులకు తెలియని చిట్కాలు అడ వుల్లో ఉండే కోయవాళ్ళకు తెలుస్తాయి. శివబైరాగి ఎందరినో చచ్చేవాళ్ళను బతికిం చాడని చెప్పుకుంటారు. ఆస్థానవైద్యులకు అంతుచిక్కని జబ్బును అలాటి చిట్కా వైద్యులే నయం చెయ్యాలి," అన్నారు రాజు గారి వద్ద కొలువుచేసేవాళ్ళు.

రాజు కొంచెం ఆలోచించి, "అయితే ఒక పని చేద్దాం. మామూలు వైద్యంతో నయం గాని తీవ్రవ్యాధులు గలవారిని కొందరిని

తెప్పించి, ఈ బైరాగి చేత చికిత్స చేయించుతాం. వాళ్ళ వ్యాధులు నయం చేసినట్టయితే, ఈ బైరాగి చేత అబ్బాయికి చికిత్స చేయిస్తాను. లేదూ, ఆ కపటవైద్యుడి తల నరికించి కోట గుమ్మానికి వేళ్ళాడగట్టిస్తాను!'' అన్నాడు.

రాజుగారు చేసిన ఈ ఆలోచన మంత్రులు మొదలైన వాళ్ళకు యుక్తియుక్తంగా కన బడింది. వాళ్ళు ఊరంతా తిరిగి అయిదారు దీర్ఘరోగులను, ఏ చికిత్సకూ లొంగని వాళ్ళను, పట్టుకొచ్చి యువరాజు పడుకొని ఉన్న గదికి పక్కగా ఉన్న గదిలో పడుకోబెట్టారు. తరవాత శివబైరాగిని పిలిపించి రాజుగారు, ''నువ్వు కపటవైద్యుడివని విన్నాను. నీకు వైద్యం నిజంగా చేతగాని పక్షంలో నిన్ను తీవ్రంగా శిక్షించవలసి ఉంటుంది. ఏమం టావు?'' అని అడిగాడు.

''మహారాజా, నేను అనేక వేల మందికి చికిత్స చేసి ఉన్నాను. నా వైద్యవిధానం వేరు, నేను వాడే ఔషధాలు వేరు. కిట్టని వాళ్ళు నాకు వైద్యం రాదని పుకార్లు వేస్తారు. వాటిని నమ్మి తమరు నన్ను శిక్షించటం భావ్యం కాదు,'' అన్నాడు శివబైరాగి.

''అయితే నీకు వైద్యం వచ్చునని ఋజువు చేసుకో. లోపల తీవ్రమైన వ్యాధులతో చాలా కాలంగా చికిత్స తీసుకుంటున్న రోగులు న్నారు. వారందరికీ రోగాలు నయం చెయ్యి. నిన్ను రాజవైద్యుణ్ణి చేసి సన్మానిస్తాను. రోగాలు నయం చెయ్యకపోయావో నీ తల తీయించి, కోట గుమ్మానికి వేళ్ళాడగట్టి స్తాను,'' అన్నాడు రాజు.

శివబైరాగికి నోటమాట రాలేదు. రాజ భటులు అతణ్ణి రోగులున్న గదికి తీసుకు



పోయారు. కొందరు రాజోద్యోగులు కూడా వెంటవెళ్ళారు. 'నేను రోగులను రహస్యంగా ప్రశ్నించాలి. మీరంతా అవతలికి వెళ్ళండి,'' అని శివబైరాగి రాజోద్యోగులందరినీ బయ టికి పంపేసి తలుపులు మూశాడు. అవతలి గదిలో రాజకుమారుడున్న సంగతి అతనికి తెలియదు.

తరవాత ఆ కపటవైద్యుడు రోగులందరి నాడీ పరీక్షించినట్టు నటించి, ''మీ అందరి రోగాలు నయంచేయగల బ్రహ్మాస్త్రంలాటి లేపనం ఒకటి ఉన్నది. మనిషి గుండెకాయ తీసి, కాల్చి, నూరి, కొన్ని ఓషధులతో చేర్చి దాన్ని మీకు పూతపూయాలి. మూడుపూతలు పూసేసరికల్లా అందరూ పిడిరాళ్ళలాగా తయారవుతారు. ఈ ఔషధం తయారు చెయ్యాలంటే మీలో మరీ తీవ్రస్థితిలో ఉన్న

వాడు చావటానికి ఒప్పుకోవాలి,'' అంటూ ఒక క్షయవ్యాధి వాడికేసి చూశాడు.

క్షయవాడికి కంపరమెత్తింది. "నా కసలు రోగమేముంది? నేను పిడిరాయిలాగున్నాను. వొద్దు మొర్రో అంటుంటే వినకుండా మా వాళ్ళు నాకు మందులిప్పించారు. నాకే రోగమూ లేదు! ఏ రోగమూ లేదు!'' అంటూ వాడు లేచి, తలుపు తెరుచుకుని శరవేగంతో బయటకి పరిగెత్తివెళ్ళాడు.

వాడు వెళ్ళిన మరుక్షణమే మరొకడూ, వాడి వెనకగా ఇంకొకడూ విల్లు నుంచి వదిలిన బాణాల్లాగా, "నాకే రోగమూ లేదు! నేను పిడిరాయిలాగున్నాను!'' అంటూ బయటకు దూసుకుపోయారు.

రోగులందరూ తమకేరోగమూ లేదంటూ వెళ్ళిపోవటం చూసి రాజుకు చాలా ఆశ్చర్యం కలిగింది. అశ్వినీదేవతలే వచ్చి చికిత్స చేసినా అయిదారుగురి దీర్ఘవ్యాధులు అర నిమిషంలో నయం కావటం సాధ్యం కాదు. ఏం జరిగిందో చూద్దామని రాజు సపరివారంగా లోపలికి వెళ్ళాడు. ఖాళీ గదిలో శివబైరాగి కనిపించాడు. అవతలి గదిలో నుంచి రాజకుమారుడు పొట్టచెక్కలయ్యేట్టు నవ్వటం రాజుకు వినిపించింది. రాజు తన కొడుకును సమీపించి, ఇంత కాలానికి వాడిలో సంతోష చిహ్నాలు చూసి పరమానందం చెందుతూ, "నీ జబ్బు నయమయిందా నాయనా? ఎందుకలా నవ్వుతున్నావు?'' అని అడిగాడు.

"నాకేం జబ్బు? నేను పిడిరాయిలాగున్నాను?'' అంటూ రాజకుమారుడు మళ్ళీ విరగబడి నవ్వాడు. అతని ద్వారా రాజు జరిగిన సంగతంతా తెలుసుకున్నాడు. కపటవైద్యుడు ప్రాణాలరచేతబట్టుకుని శిరశ్ఛేదానికి ఎదురుచూస్తున్నాడు.

రాజు అతని కేసి తిరిగి, "నీకు వైద్యం ఏమీ రాదు. అయినా నిన్ను క్షమిస్తాను. నువ్వు ఇక ముందు వైద్యం చెయ్యటం మానేసి, మా ఆస్థానంలో విదూషకుడివిగా ఉండు! యువరాజు వెంటవుంటూ అతడికి దిగులు అన్నది కలగకుండా చూడటం నీ పని!'' అన్నాడు.

శివబైరాగి ఆస్థానవిదూషకుడుగా ఉంటూ రాజకుమారుడికి ఎలాటి విచారమూ కలుగకుండా చూశాడు.

అందుకే హాస్యాన్ని మించిన ఔషధం లేదంటారు.




THE AMUL CHEESE BOY
IN PICNIC PANIC


One bright sunny day...


...a picnic is in progress.


Little Munnu Verma crawls away.
GURGLE


Suddenly, huge rocks come tumbling down the mountain.
RUMBLE


Amul cheese boy eats an Amul cheese slice...


...and becomes strong and powerful.


He smashes the falling rocks...
BANG


...reducing them to small pieces.
CRACK


Munnu is rescued and back with his family.


All thanks to the cheese that has more milk in it.


Amul cheese slices.
Amul cheese. Yes please!
Amul

# ప్రత్యేకమైన లక్ష్మీపూజ!

ఉత్కళదేశం, కళింగరాజ్యం అని చరిత్రప్రసిద్ధిగాంచిన ఒరిస్సా ప్రాంతం అసంఖ్యాకమైన దేవాలయాలకు నిలయం. విలక్షణమైన శిల్పవిన్యాసాలకు పేరుగాంచిన పలు దేవాలయాలు కాలప్రవాహంలో కరిగిపోకుండా, ఈనాటికీ చెక్కుచెదరకుండా నిలిచివున్నాయి.

ఇక్కడి శిల్పాలలాగే, ఒరియా ప్రజలు దేవుళ్ళను పూజించే పద్ధతులు కూడా చాలా విలక్షణంగానే కనిపిస్తాయి. సంపదలకు నిలయమైన లక్ష్మీదేవి పూజను పరిశీలిస్తే ఈ విషయం తేటతెల్లమవుతుంది. బియ్యం కొలవడానికి ఉపయోగించే మట్టిమానిక (పాత్ర) నిండా వడ్లు నింపుతారు. అదే లక్ష్మీదేవి రూపం! మార్గశీర్ష మాసంలో ప్రతిలక్ష్మీ (గురు) వారం ఇల్లలికి, ముగ్గులు వేసి, స్త్రీలు ఉపవాసాలుండి ఈ దేవతా ప్రతీకను భక్తితో పూజిస్తారు. దీనిని 'మానబాస' అని అంటారు.

ఈ లక్ష్మీపూజకూ, పూరీ శ్రీ జగన్నాథ మందిరానికీ సంబంధించిన ఒక విచిత్రమైన కథను ఇక్కడి ప్రజలు చెప్పుకుంటారు.

జగన్నాథుడు మహావిష్ణువు, ఆయన సతీమణి సాక్షాత్తు లక్ష్మీదేవి అన్నది జగద్విదితం. మార్గశీర్ష మాసంలో ఒక లక్ష్మీ వారం నాడు తన భక్తులు తనను ఎలా కొలుస్తున్నారో కళ్ళారా చూడడానికి లక్ష్మీదేవి బయలు దేరింది. శ్రియ అనే ఒక చండాళ స్త్రీ, అమాయకమైన భక్తి శ్రద్ధలతో తనను కొలిచే తీరును చూసి ముగ్ధురాలయింది. ఆమె అక్కడ నిలబడి ఉన్నప్పుడు అటుకేసి వచ్చిన జగన్నాథ, బలభద్రులు ఆమెను చూశారు. చండాళస్త్రీకి అతి సన్నిహితంగా లక్ష్మీదేవి నిలబడి ఉండడం చూసి బలభద్రుడు ఆగ్రహం చెందాడు. ఆమెను వెంటనే వదిలిపెట్టమని తమ్ముడైన జగన్నాథుణ్ణి ఆదేశించాడు. అన్నమాటకు అడ్డు చెప్పలేక జగన్నాథుడు సరేనన్నాడు.

లక్ష్మీదేవి దేవాలయాన్ని వదిలిపెట్టగానే, ఆమెతో సహా ఆమె సేవకులందరూ అక్కడి సంపదలను తీసుకుని ఆలయాన్ని వదిలివెళ్ళారు. తాళవేతాళులనే దేవతామూర్తులు కృష్ణబలరాముల అందమైన తల్పాల మీది ఆభరణాలను కూడా తీసుకువెళ్ళారు. ఆలయం పాడుపడింది. ఆఖరికి బలరామకృష్ణులు ఆకలికి తట్టుకోలేక భిక్షాటనకు బయలుదేరారు. అయితే, లక్ష్మీ కటాక్షం లేకపోవడంతో వాళ్ళ కెవరూ భిక్షం కూడా వేయలేదు. దాహం ఎక్కువై నీళ్ళు తాగడానికి వెళితే, కొలను కూడా వెంటనే ఎండిపోయింది.

ఆఖరికి వాళ్ళు చండాళస్త్రీ ఇంటిముందు నిలబడి భిక్షానికి వినయంగా చేతులు చాచారు. అక్కడున్న లక్ష్మీదేవి కనికరించి, స్వయంగా వండి వాళ్ళకు పెట్టింది. 'పోడ్‌పితా' అనే ఆ రొట్టెను తినగానే అమృతోపమానమైన ఆ ఫలహారం లక్ష్మీదేవి చేతివంట అని అన్నదమ్ములు గ్రహించారు. ఆమెకు క్షమాపణలు చెప్పుకుని తమ వెంట రమ్మని వేడుకున్నారు. ఆమె వారి కోరికను మన్నించింది. అయితే, ఆలయంలో అడుగుపెట్టడానికి ఒక నియమం విధించింది. పేద-పెన్నిధి, నీచుడు-ఉన్నతుడు అనే తరతమ భేదాలు పాటించకుండా దేవాలయానికి వచ్చే భక్తులందరికీ సరిసమానంగా ప్రసాదం అందించాలన్నదే ఆ నియమం. అన్నదమ్ములు అందుకు అంగీకరించారు. ఆ సంప్రదాయం ఈనాటికీ కొనసాగడం విశేషం. ఈ సంఘటనను గుర్తు చేసే విధంగా శ్రీజగన్నాథ మందిరంలో మార్గశీర్ష మాసంలో విభిన్న పూజావిధులు క్రమం తప్పకుండా జరుగుతున్నాయి.




[దేశవ్యాప్తంగా పలు ప్రాంతాలలో దీపావళి పర్వదిన సందర్భంగా లక్ష్మీపూజ చేస్తారు. అయితే ఒరిస్సాలో మాత్రం మార్గశీర్ష మాసం (డిసెంబర్ - జనవరి) లోనే లక్ష్మీపూజ జరుపుకుంటారు.]



# నమ్మలేని ఘనకార్యం

చాలా కాలం క్రితం జపాను దేశంలో ఒక జమీందారు ఉండేవాడు. తాత ముత్తాతలు సంపాదించి పెట్టిన భూమీ, ఆస్తిపాస్తులు తప్ప ఆయన ఏదీ గొప్పగా సాధించలేదు. అందువల్ల ఆయన తన పూర్వీకుల గొప్పదనాన్ని తలుచుకొని, ''వాళ్ళు చాలా గొప్ప వాళ్ళు. వాళ్ళు సాధించలేనిదంటూ ఏదీ లేదు,'' అని చెప్పుకుని మురిసిపోయేవాడు.

ఆయన మనస్తత్వాన్ని గ్రహించి ప్రతి రోజూ కొందరు ఆయన చుట్టూ చేరి తమ పనులు సాధించుకోవడం కోసం ఆయన తండ్రి, తాత ముత్తాతలకూ లేనిపోని గొప్పదనాన్ని అంటగట్టి పొగిడేవారు. ఒకడు, ''మీ తండ్రిగారు మన రాజునే ఎదిరించి జయించాడు,'' అనేవాడు. మరొకడు, ''మీ తాత మన రాజ్యంలో పేరుమోసిన పండితుణ్ణి వాదంలో చిత్తుచేశాడు,'' అనేవాడు. ఇంకొకడు, ''మీ ముత్తాత చాలా అందమైన వారు. ఆయన సుందరరూపం చూసి మైమరచి అప్సరసలే పెళ్ళాడడానికి వచ్చారు. మీలో మీ ముత్తాత పోలికలు చాలా ఉన్నాయి. మిమ్మల్ని పెళ్ళాడడానికి రేపోమాపో ఏ అప్సరస వచ్చినా ఆశ్చర్యం లేదు!'' అనేవాడు.

''అవునవును. మా పూర్వీకులు సాధించలేనిది ఏదీలేదు. అది జగత్ప్రసిద్ధం!'' అనేవాడు జమీందారు ఆనందంగా.

ఇలా కొన్నాళ్ళు గడిచింది. ఒకనాడు జమీందారు తన చుట్టూ ఉన్నవారితో, ''మా తాత ముత్తాతలు చేయలేని ఘన కార్యం ఏదైనా ఒకటి మీలో ఎవరైనా చెప్పగలరా? అలా చెప్పిన వారికి నూరు బంగారు కాసులు బహుమానం ఇస్తాను,'' అంటూ ఒక సంచీ నిండుగా వున్న బంగారు నాణాలను చూపాడు.

ఆయన చుట్టూవున్నవారెవరూ కొత్త సంఘటనను కల్పించి చెప్పలేకపోయారు.

ఆ సమయంలో ఒక పేదరైతు అక్కడికి వచ్చాడు. తన పొలంలో పెట్టిన పంటకు

జపాను జానపద కథ

జమీందారు గుమాస్తా ఒక వెండి కాసు పన్ను విధించాడు. అది చాలా ఎక్కువ అనీ, అన్యాయమనీ రైతు జమీందారుకు విన్నవించాడు.

"ఒకవెండికాసుకే ఎందుకిలా బెంబేలు పడిపోతున్నావు? మా పూర్వీకులు చేసిన ఘనకార్యాలలో ఒకటి చెబితే చాలు. నూరు బంగారు కాసులు బహుమానంగా గెలుచుకోవచ్చు," అన్నాడు జమీందారు.

"తమ తాతగారికి ముత్తాతగారు చేసిన ఘనకార్యం ఒకటి చెప్పగలను, ప్రభూ! అలాంటి ఘనకార్యం ఇతర జమీందారులే కాదు; రాజులుగాని, వారి తాతముత్తాతలు గాని చేసిఉండరు!" అన్నాడు రైతు.

"అలాగా!" అంటూ ఆశ్చర్యపోయిన జమీందారు, "అది అసాధ్యమైన ఘన కార్యం అని నువ్వు చెబితే చాలదు. మరెవ్వరూ చేయలేని ఘనకార్యం అని నాకే అనిపించాలి. సరేనా?" అన్నాడు.

"అంతేకదా? న్యాయనిర్ణయం చేయడానికి నేనెవర్ని ప్రభూ!" అన్నాడు రైతు వినయంగా.

"సరే చెప్పు," అన్నాడు జమీందారు.

రైతు చెప్పడం ప్రారంభించాడు : "మీ తాతగారికి ముత్తాత అంటే మీకు ముందు ఐదవతరం వారైన జమీందారుగారు మహా గొప్పవారు. ఆయన ఒకనాటి ఉదయం తన పరివారంతో దూరంగా ఉన్న దేవాలయానికి పల్లకీలో బయలుదేరారు.

మధ్యాహ్న సమయానికి వాళ్ళొక పెద్ద మర్రివృక్షం దగ్గరికి చేరారు. జమీందారుకు అక్కడ విశ్రాంతి తీసుకోవాలనిపించింది. పల్లకీనుంచి దిగారు. అప్పుడు ఆ దారి గుండా వెళుతూన్న ఒక బాటసారి, "ప్రభూ! ఈ చెట్టు మీద రకరకాల పక్షులు చాలా ఉన్నాయి. అవి మీ దుస్తుల మీద రెట్టవేసి పాడుచేయవచ్చు, వేరొక చోట విశ్రాంతి తీసుకోవడం మంచిది," అన్నాడు.



'ఛీ! ఛీ! ఈ ప్రాంతానికే జమీందారునైన నేను చెట్టుమీది పక్షులకు భయపడి వేరొక చోటికి తరలివెళ్ళడమా?' అంటూ జమీందారు అక్కడే కూర్చున్నాడు.''

ఆ కథను వింటూన్న జమీందారు, ''అవును, అది సహజమే. తన నిర్ణయానికి భిన్నంగా ఎవరు ఏం చెప్పినా ఆయన విని పించుకోరు. మహాస్వతంత్రులు!'' అన్నాడు.

రైతు మళ్ళీ ఆరంభించాడు : '' కొంత సేపటికి జమీందారుగారి చొక్కామీద ఏదో పిట్ట రెట్టవేసింది. 'ఈ చొక్కాను అవతల పారేసి కొత్త చొక్కా తీసుకురండి,' అన్నాడు జమీందారు. సేవకులు కొత్త చొక్కా తెచ్చి ఇచ్చి ఆయన తొడుక్కునేలా చేశారు.

మరికొంతసేపటికి మరొక పక్షి ఆయన కప్పుకున్న శాలువాపై రెట్టవేసింది. 'ఈ శాలువాను అవతల పారేసి, కొత్త శాలువా తీసుకురండి,' అన్నాడు జమీందారు. సేవ కులు అలాగే చేశారు.''

''అదీ సహజమే కదా? మా ముత్తాత ముత్తాత ఎక్కడికి వెళ్ళినా తనవెంట ఒక పెట్టె నిండుగా కొత్తబట్టలు తీసుకువెళ్ళేవారు!'' అంటూ జమీందారు గొప్పగా చెప్పుకున్నాడు.

''ఆ తరవాత మరికొంతసేపటికి ఇంకొక పిట్ట జమీందారు గారి అందమైన చెప్పుల మీద రెట్టవేసింది. వెంటనే ఆయన వాటిని దూరంగా గిరవాటేసి సేవకులకేసి చూశారు. వాళ్ళు కొత్తజోళ్ళు తెచ్చి ఆయనముందు ఉంచారు.''

''ఆహా! నాకు తెలుసు. ఆయన దేనినీ పట్టించుకోరు. మా పూర్వీకుడు కదా!'' అని మురిసిపోయాడు కథ వింటున్న జమీందారు.

రైతు మళ్ళీ ఆరంభించాడు : ''మరి కాస్సేపటికి మరొక పిట్ట రెట్ట సరిగ్గా ఆయన తలమీద పడింది! 'నా తలను తీసి అవతల పారేయండి! తక్షణం కొత్తతల తీసుకురండి!' అని ఆజ్ఞాపించాడా మహానుభావుడు!''

''అది నమ్మేలా లేదు!'' అన్నాడు కథ వింటూన్న జమీందారు.

''కృతజ్ఞతలు, ప్రభూ! నేను నా బహు మతిని గెలుచుకున్నాను!'' అంటూ రైతు కాసుల సంచీని అందుకున్నాడు. అక్కడ ఉన్న వాళ్ళందరూ నవ్వి చప్పట్లు చరిచారు. జమీం దారు రైతుమాటను కాదనలేకపోయాడు.

రైతు జమీందారుకూ, అక్కడున్న వారికీ వంగి నమస్కరించి, కాసుల సంచీతో సంతో షంగా తమ గ్రామానికి బయలుదేరాడు.





# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

ఫోటో వ్యాఖ్యల పోటీ, చందమామ, వడపళని, చెన్నయ్-600 026.





వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్ కార్డుపైన రాసి ఈ నెల 25 వ తేదీ లోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు డిసెంబర్ 2000 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

## అభినందనలు



ఆగస్ట్ 2000 నెల సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:

పి. దేవీప్రియ
10/208, కోటకొమ్మల వీధి,
తిరుపతి - 517 501 (ఆం.ప్ర)



మొదటి ఫోటో : అమ్మ చెప్పిన పని చేస్తున్నా!
రెండవ ఫోటో: అమ్మ కోసం చూస్తున్నా!